

బ్రహ్మశ్రీ రావుబహదూరు తెల్లాకుల జాలయ్యగారు
మునిసిపల్ చైరుమన్, గుంటూరు.
దేశహిత గ్రంథమాలకు మహారాజ పోషకులు.

# మహాశయుల యభిప్రాయములు

మహాశయా !

లేశముగాని సంశయములేని తెఱంగున దుర్విమర్శలన్
నాశమొనర్చి న్యాయము ఘనంబుగ రాత్రిని బాదుకొల్పు నీ
యాశయముల్ ఫలింప విజయంబు ఘటింపగఁ జేసి నీకు నీ
దేశహితప్రదీపికకు దేవుఁడొసంగుఁ జిరాయురున్నతుల్.

గద్వాల (బోడలవీడు) } శ్రీమద్గద్వాలాస్థానకవి, కవిసింహ
పోకూరి కాశీపత్యవధాని

దేశహితైక గ్రంథములను జిన్నచిన్న సంచికలుగ నన్ని తరగతుల వారికి సుగమముగ నుండునట్లు ప్రకటింపఁబూని "దేశహిత గ్రంథమాల"ను స్థాపించి నడుపుచున్న దేశభక్త వి. యస్. శర్మగారి మూడు సంచికలను జూచితిని, వీరి యపూర్వ సత్యసంపూర్ణ విచిత్ర విమర్శనము శ్లాఘనీయమైనది. ఇంతకు ముందెవ్వరు నీ దారి ద్రొక్కలేదు. పాఠశాలలలోని విద్యార్థుల కుగ్గుబాలతోడ నిట్టి సత్యస్వరూప విమర్శనములను దలకెక్కించుట శుభోదర్కము. దేశహితైషులగు ప్రాజ్ఞులెల్లరు నీ గ్రంథమాల నాదరింతురని నమ్ముచున్నాను.

సూజవీడు, 8-11-44 } పండిత, ఆయుర్వేద స్థాపక మహామహోపాధ్యాయ
చిపుకుల సత్యనారాయణశాస్త్రి

దేశభక్త వి, యస్. శర్మగారి "దేశహితప్రదీపక" జదివిన తరువాత, మనచే నిప్పటివరకు, సత్యగ్రంథములని పరిగణింప బడెడు గ్రంథములలోఁ బెక్కు తప్పుల తడికెలనియూ, సత్యదూరములనియూ, గులాభిమానముతో వ్రాయబడినవనియు, దేటతెల్ల మగుచున్నది. నిష్పాక్షిక విమర్శనలతో శ్రీ శర్మగారు మనల నజ్ఞానాంధకారమునుండి బయిట బడవేయగలిగిరి. వారి యాకృషియెంతయు నెన్నదగినది. వారి కలము నుండి యిట్టి విమర్శనా గ్రంథములు ముందు యింకెన్నియో రాగలవని యాశించు చున్నాను.

గుంటూరు. 6-10-45 } జాగర్లమూడి చంద్రమౌళి, బి. ఎ., బి. యల్.,
అడ్వకేటు - గుంటూరు

జానకిరాం ప్రెస్, తెనాలి. P. C. K. 73 : or 7-8 : 10-45 కా॥ 500

## పబ్లిషర్ : పలుకులు

1, 2, 3, 4 భాగముల నీ దేశహిత ప్రదీపిక'ను వరుసగఁ బ్రచురించుటలోఁ దోడ్పడిన మహాశయులందఱికిని మదీయానేక కృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాను. 4 వ భాగమత్యధికత్వరలోఁ బ్రచురింపఁగలనను వాశ బంబరు, గుంటూరు, బాపట్ల, ఏలూరు మొదలగు చోటులందు బ్ర॥ కవికేసరి అద్దేపల్లి సత్యనారాయణగారు, బ్ర॥ పండిత జమిలి నమ్మాళ్వారుగారు, బ్ర॥ ముదపాక [ఎట్టి] సుబ్బారావుగారు, బ్ర॥ వైద్య విద్వాన్ కందుకూరి వేంకటభుజంగరావుగారు. ఇంకను బలువురు పలుచోట్ల సహాయులను బోషకులను జేర్పించుట మూలమునఁ దోడ్పడుటచేఁ గలిగినది.

కాని శ్రీ జానకిరామ్ ప్రెస్ వారు తమ పనుల తొందఱలో నీభాగమును ముద్రించుటకు (1944) వాయిదాలను వేయుచుఁ దుదకుఁగొన్ని ఫారములు ముద్రించియు పేపరుకంట్రోలు ఆర్డరు(ఎకానమి) వచ్చుటచే పని నాపివేసిరి. వెంటనే కరెస్పాండెన్సు చేయుటకు నా శరీరాస్వస్థత కొంత కారణమై యవకాశము లేక తదుపరి కరెస్పాండెన్సుచేసియు ప్రయోజనము లేక పోయినది.

దైవానుగ్రహమున(22-5-45)లైసెన్సుపొందవలసినట్లుతెలియుటచే నా లైసెన్సుకు దరఖాస్తు చేయుటయు 'కోటా' వచ్చుటయుం గలిగినది, నేఁడు యుద్ధమంతరించి మిత్రమండలి కేర్పడిన విజయోత్సాహముతో నీ భాగము నింత వెలువరింపఁ గలిగినందుకు మిక్కిలి సంతసించుచున్నాను. శ్రీ జానకిరామ్ ప్రెస్ వారికి వారిపనివారికి నే కృతజ్ఞుఁడను.

విరాళముల వాగ్దాతలు త్వరలో తమవిరాళములను దయచేయగలందులకు ప్రార్థితులు.

రాజరాజేశ్వరీపేట, బెజవాడ

పబ్లిషర్ : దేశహిత గ్రంథమాల,
దేశభక్త, వి. యస్. శర్మ అండ్ సన్సు,

---

సవరణ:—5– పుట 2 పంక్తిలో. (...266)అని

,, 42 పుట 10–11 పంక్తులలో [కృతిలో "రామానుజప్రభు వేదాద్రి శిక్షించు వ్రాయసములౌరా !" అన్నట్లే] 20 పంక్తిలో [మరియొత్సవాకృతిం] ఇంకను గల ముద్రాక్షరాది దోషములను పాఠకులే సవరించుకొనం ప్రార్థితులు

శ్రీ విశ్వజ్ఞాయనమః



## (vi) రామకృష్ణకవి. రామలింగకవి

ఇతః పూర్వము రామకృష్ణుని కాలనిర్ణయాదులను బలువురు పలువిధములఁ జర్చించి యున్నారు. రామకృష్ణుని యొక్కయు, రామలింగనియొక్కయు జీవితముల నొకేవ్యక్తికి సమన్వయింపఁజేయఁ బ్రయత్నించుటచేఁ బెక్కురు కర్తవ్యమునకు దూరులైనట్లు గోచరించెడిని. ఈ కవు లిరువురును సమవయస్కులుకాక వేర్వేఱు కులంబుల జన్మించి. వేర్వేఱు చాటువులను, కబ్బములను రచించి వేర్వేరు విధములుగఁ దమ తమ యశశ్చంద్రికలఁ బ్రపంచమున విరజిమ్మిన వారని దీర్ఘ విమర్శనలం దేట పడియెడు. వీరు స్వీయముగ నిరాఘాటముగను, చాటులేని మాటలతోడను జెప్పిన చాటువులును, వీరు రచించిన కావ్యములును వీరు వేర్వేఱు కవులని స్పష్టీకరించెడిని. అన్నియుని యథారూపములుగఁ బ్రత్యేకింపఁ గలుగుచో వారి జీవితములు వేఱువేఱుగ నిర్దుష్టముగ బయల్వెడఁగలవు. కలగూరగంపగ నుండిన యనేక గ్రంథాదులనుండి యీ యంశములు సంగ్రహించి నిరూపింప సాహసించినందులకు ప్రాజ్ఞులు మన్నింతురు గాక! సావధానముగ గమనించెదరుగాక.*

* చరిత్ర పరిశోధనమున రామలింగ, రామకృష్ణకవుల చరిత్రములును, చెయ్దములును వేర్వేఱని పాఠకులకు దృగ్గోచరము కాకపోదు.

"మేధాసిధు" లందలి రామకృష్ణుని కాలనిర్ణయాదులు గాంచుడు. రామకృష్ణుఁడు "క్రీ. శ. 1543వ సం॥నఁ గృష్ణదేవ రాయల యాస్థానమందలి యష్టదిగ్గజములలో నొకఁడై యుండినటులఁ గన్పట్టుచుండెను." [1] (మే. పుట. 55)

శ్రీకృష్ణదేవరాయలు క్రీ. శ. 1515 వ సంవత్సరమున సింహాసనమెక్కి 1530 వ సంవత్సరమున నంత్యదశ బొందెను. అందుచే నాయాస్థానాష్ట దిగ్గజముల సమ్మేళనము 1543 వ సంవత్సరమునందుఁ గనుపట్టుట యసంభవం బగును. రాయల పాలనా మధ్య కాలమున నీకవితా సమ్మేళనము గలిగి యుండనోపును. నాఁటికి రామకృష్ణుఁడు పిన్నవయస్కుఁడై బాల కవిగ నుండిన నుండవచ్చును గాని ప్రౌఢకవిగ నైన నుండుటకవకాశమే లేదు. ఎందువలననఁగా:



రాయల యనంతర కాలమునఁ బాలనము నకు వచ్చిన అచ్యుత దేవరాయల యనంతర సదాశివరాయల (క్రీ. 1568 సం.) కాలములో నొక జాగీరుదారైన గురవరాజు యొక్క పుత్రుఁడు పెదసంగ రాజుయొక్క జాగీరులోని యొక గ్రామమగు "విరూరు"నందలి కరణమగు "వేదాద్రి"కి యీరామకృష్ణుఁడు తన వృద్ధాప్య దశలో రచించిన పాండురంగ మాహాత్మ్యమును గృతినేసినది.

---

[1] "కృష్ణరాయలు పుత్రవియోగజనిత సంతాపచిత్తుఁడై యంత్య కాలమున దినములు దుర్భరములై క్రీ. శ. 1530 వ సంవత్సరమునఁ బరమ పదించెను." (జీర్ణవిజయనగర చరిత్రము 181 పుట.)

పాండురంగమాహాత్మ్య కృతిసమర్పణము రమారమి క్రీ. శ. 1568 సం. ప్రాంత మగుననియు నప్పటికి రామకృష్ణునకు సుమారు 70 వత్సరముల ప్రాయ ముండుననియు నాయా శాసన చరిత్రాదులవలనఁ గూడ తెలియఁ గలదు.

క్రీ. శ. 1520 వ సంవత్సరమున శ్రీ రామకృష్ణకవికి సుమారు 20సంవత్సరములకు మించిన వయస్సుండదని తెలియ వచ్చును. నాఁటికేర్పడిన రాయల యాస్థాన దిగ్గజాష్టకవుల వెంబడింగల పిన్నయేన్గ కవిగ నీరామకృష్ణుఁడు తయారై యుండనోపును.

### రామకృష్ణుఁడు అతని నామనిర్ణయాదులు

(విద్యాభ్యాసము)

"ముగ్వుర నామములు గలసి వచ్చునటుల 'భాస్కర' 'రామ' 'కృష్ణుఁ'డని నామముంచఁ బడెనఁట. ఏతత్కారణమున భాస్కరశబ్ద భవమగు 'బాచఁడు, బాచిగాఁడు'నను నామము లాతఁడు గలిగి యుండవచ్చును." (మేధా. 56 పుట.)

ఇందెందును రామకృష్ణునకు రామలింగమను పేరు గలిగినట్లు కాని, అట్టి పేరు గల్గుటకుఁ దగిన కారణమున్నట్లు గాని కనంబడదు.

ఈతఁడు నియోగులం దగ్రశాఖకుఁ జెందిన కుటుంబము నందు జనించినను జిన్నతనముననె జననీజనకులఁ గోలుపోవు టచే భయభక్తులతో విద్యనార్జించుట కనువుపడదయ్యెను. కాని,తన యూరికిఁ జేరువనె కల భట్టుపల్లె యందలి భట్రాజుల సాంగత్యమునఁ దిరుగుచుఁ గవిత నల్లగల నేర్పరి యయ్యెను.

ఇటుల కవియైన రామకృష్ణుఁడు తన శాఖీయుఁడగు తిమ్మరుసుమంత్రి ప్రాపకము సంపాదించుకొని రాయల యాస్థానమునఁ దన బాలకవితను బ్రసరింపఁజేయఁ గడంగెను.

శ్రీకృష్ణదేవరాయలు భట్టుమూర్తి మొదలగు కవులను మిక్కిలి గౌరవించుచుండుట రామకృష్ణునకు సరిపడమిచేఁ బెద్దన తిక్కనాదుల గౌరవించుచుఁ దన్నన్వయించుకొని తక్కుం గవుల నిరాకృతం బొనర్ప నీక్రింది పద్యము రచియించెను.

క. కవి యల్లసాని పెద్దన
కవి తిక్కనసోమయాజి గణుతింపంగాఁ
గవి నేన రామకృష్ణుఁడఁ
గవియను నామంబు నీరుకాకికి లేదే!

తిమ్మరసుమంత్రియొక్క ప్రాపు చూచికొని రామకృష్ణ కవి భట్టుమూర్తి కవి యంతటి వానినిఁగూడ విపరీతముగఁ దెగడినట్లు కలదు (స్థలాంతరమునఁ గాంచుఁడు.)

♦ రామలింగని కాలనిర్ణయాదులు

రామలింగను "క్రీ. శ. 1462 వ సంవత్సరమున జనన మొందెననియు, పైకాలమును సూచించెడి యాతని జన్మ పత్రికవలన నితఁడు మంచి లగ్నమునందు బుట్టినట్లు గానవచ్చు చున్నదనియు నఱువది సంవత్సరముల క్రిందట తన దక్షిణ

♦ కులగోత్రాదులు, ఇండ్లపేరులు, వ్యక్తుల పేరులుసైతము అటనట మార్పు చెందించుట వీరేశలింగముపంతులు వంటి చరిత్రకారులకు పరిపాటియె. టంకసాల నృసింహాకవిని సంకుసాల నృసింహాకవి యనియు, నియోగియనియు నిర్వచించుట గమనింపఁ దగినది.

ఇటులనె పూర్వమహాకవుల కులగోత్రాముల మార్చి కాళిదాసు,అమరుక కావ్యకర్త,మాఘుఁడు మొదలగు వారిని పాఱులుగ నిరూపించుటకు వ్రాసెడి

హిందూస్థాన కవిచరిత్రమునందు కావలి వెంకటస్వామిగారు వ్రాసియున్నారు. (ఆ ద్వి. భా. 257 పుట.)

"దక్షిణహిందూదేశ కవిచరిత్రము" నందు శ్రీ రామస్వామిగారు చూపిన రామలింగ జనన పత్రిక ప్రౌఢకవియైన తెనాలి రామలింగకవి కాల నిర్ణయమునకు సాధకమై యున్నది.

రామలింగకవి 1462 సం॥ జనించి రాయల పాలనా కాలమగు క్రీ. శ. 1515వ సం. నాటికి రమారమి యేబదివత్సరములకు మించిన ప్రాయముగల ప్రౌఢకవి యయ్యెననుటకు సందియము కన్పట్టదు.

రామలింగకవి కృతులు:—రామలింగము "శివార్చన చంద్రిక, శివతత్త్వవివేకము, శివమణిదీపిక, ఆత్మార్పణము" అను శైవగ్రంథములను జేసెననియు, అతఁడు నాటికంటె నెక్కుడు పుస్తకములను రచించె ననియుఁ జెప్పుదురు. ఇతఁడు నిరోష్ఠ్య రామాయణమును రచించె ననువార్త గలదు కాని అది లేనందున నమ్మందగదు."(ఆంధ్రకవులచరిత్ర 287 పుట.)

హిమాచలము మనయొద్దనుండి గనుపట్టనంత మాత్రమున నదియొకచోఁ గలదనువారను నమ్మందగదనుట యెట్టిదో మనయాంధ్రకవుల చరిత్రకారులను నమ్మందగదనుటయు నట్టిదియై యుండవచ్చును. కాలగర్భమున నెన్ని గ్రంథాదులు మాటుమణఁగి యున్నవియో ఎవరు దెలుపఁగలరు!

వెట్టిమొట్టి వ్రాతలును, నిందుల కుదాహరణములు కానోపును.

ఇట్టి మహాకవుల కావ్యకళా ఛాయలబట్టియు, నిష్పక్షపాత విమర్శనల వలనను నట్టివారిని గ్రహించ వచ్చును. (ముందు ముందు వెలువడు గ్రంథముల గాంచనగును.)

రామలింగకవి కృతులు కొన్ని యితరుల కంటఁ గట్టబడి యుండినట్లు తెలియుం గల యంశములం గాంచుఁడు.

"శ॥ విజయకృతి కర్తృత్వము రామకృష్ణున కారో పించిరి కాని యందొక పద్యమునైనను జదివిన వారికి నాపాడు పుస్తకము రామకృష్ణకవి విరచితముకాదని తోఁపకమానదు."

(ఆం. క. చరిత్ర. ద్వి. 297 పుట.)

"శ. విజయము" కేవలము అవినీతిదాయకము లగు పురాణగాథల నిరసించుటకె సంకల్పితమై యుండెడినో?

ఇందలి గాథ రాముఁడు ప్రశ్నింపఁగా వాల్మీకి చెప్పిన ట్లుండును. ఈకల్పనా చమత్కృతి—వాల్మీకియె యిందా ఖ్యాత యగుట—యదియొక విశేషార్థమునె యిచ్చును. ఏలయన ఈవాల్మీకియె కదా నారదునివలన విని రామాయణమును రచింపఁ గలిగెను. సీతను తనయొద్ద నుంచుకొని ఆమెకు కుశుఁడను కుమారుని సైతము గల్గించిన అఘటఘటనా సమర్థుఁడు. (పౌరుష శీలవిశేషముల నుత్తములగు నాఁటి దక్షిణాత్యుల రాక్షసులుగను, కోతులుగను వర్ణించిన మహా త్ముఁడు! వాలివధ, శంబూక వధల ధర్మనిర్ణయములకుఁ బ్రయాసపడిన కష్టాత్ముఁడు!)

---

N. B. దక్షిణ హిందూస్థానము నందలి రామాలయములలోఁ బ్రసిద్ధిం బడసిన భద్రాచలాలయముం గూర్చి కొంత ముచ్చటించవలసి యున్నది. ఆ యాలయమును గట్టించినవారె (క్రీ. శ. 16:0 సం॥ ప్రాంతమున) అక్కన్న మాదన్నలను మంత్రులయొక్క మేనల్లుఁడగు కంచర్ల గోపన్న యను నొక నియోగి బ్రాహ్మణుఁడు.

ఇతఁడు గోలకొండ పాలకుఁడైన "అబూహసన్ కుతుబ్ షా" యను తానీషా కొల్వులో నొక తహసీలుదారుగ నుండెను.

అట్టి వాల్మీకి విరచిత రామాయణమునకు జిలనలు పలవలుజేర్చి మూలమునుగూడ మార్చి వేచు చుండెడి కవున నేమన వలయును? వాల్మీకి రచిత శ్రీమద్రామాయణము ౧౭ వాల్యము, (౧౧౮ సర్గ యుద్ధకాండ) 2219 పుటనుండి కాంచుడు. రాముడు రావణవధానంతరము సీతను దగ్గరకుఁ బిలిపించి యిట్లనుచున్నాడు.

శ్లో॥ కఃపుమాన్ హి కులేజాతః స్త్రియం పరగృహోషితామ్,
తేజస్వీ పునరాదద్యా త్సుహృల్లేఖ్యేన చేతసా. (సర్గ. ౧౧౮) ౧౯.

పరుని గృహమునందు నివసించిన భార్యను సత్కులమున జనించిన పరాక్రమవంతుఁ డగు పురుషు డెవ్వఁడు మిక్కిలి ప్రియముతో మరల స్వీకరించును?

శ్లో॥ రావణాంక పరిభ్రష్టాం దృష్టాందుష్టేనచక్షుషా,
కథం త్వాం పున రాదద్యాం కులం వ్యపదిశన్ మహత్. ౨౦.

ఇంతకాలము రావణుని తొడయందుండి యిపుడు జాటి వచ్చినదానవును, (రావణునిచే మన్మధాతురంబగు) చెడుదృష్టిచేఁ జూడబడినదానవును, నగునిన్ను నా గొప్పకులమును వెల్లడి చూపుచు ( నాగొప్ప కులమున కవమానకరముగ) మరల నెటులఁ బరిగ్రహింపవచ్చును?

---

తహసీలుదారుగ నున్న గోపన్న ప్రజలనుండి పన్నుమూలముగఁ దాను వసూలుచేసిన సర్కారుసొమ్ము నంతయును పాయుల సంతర్పణలకును, రామాలయమునకును వెచ్చించి జమాబందీనాఁటికి "హారేరామ, హారేరామ" యనుచుఁ దపోనిష్ఠాగరిష్ఠుఁ డయ్యెను.

గోపన్నను చెఱసాలయం దుంచిరి. తానీషాయొద్ద సర్వసైన్యానాయకులుగను,ప్రధాన మంత్రులుగను నుండిన అక్కన్న మాదన్నలు గోపన్నయొక్క మేనమామలు. వారు గోపన్నయొక్క చెఱవిముక్తికిఁ దగిన కృషి చేయవలసిన వారు.

శ్లో॥ తదర్థం నిర్జితా మే త్వం యశః ప్రత్యాహృతం మయా,
నాస్తి మే త్వయ్యభిష్వంగో యథేష్టం గమ్యతా మితః ౨౧.

అవమానము పోగొట్టుకొనుటకు నీవు మరల జయించఁబడితివి. పోయిన కీర్తిని మరల సంపాదించితిని. నీయందు నాకు ఆసక్తిలేదు. ఇచటనుండి నీ యిష్టమువచ్చినచోటికి పొమ్ము.

శ్లో॥ ఇతి ప్రత్యాహృతం భద్రే! మ యైతత్కృతబుద్ధినా,
లక్ష్మణే భరతేవా త్వం కురు బుద్ధిం యథా సుఖమ్. ౨౨.

భాగ్యవంతురాలా! నేను బాగుగా నాలోచించియె యిట్లు చెప్పితిని. నీవు నీకెట్లు సుఖమో అటుల లక్ష్మణుని యందుఁగాని, భరతునియందుఁగాని మనసు పొందుము.

శ్లో॥ సుగ్రీవే వానరేన్ద్రేవా రాక్షసేంద్రే విభీషణే,
నివేశయ మన స్సీతే! యథావా సుఖ మాత్మనః. ౨౩.

సీతా! ఎటుల నీ యాత్మకు సుఖమనితోఁచునో యటుల వానర రాజయిన సుగ్రీవునియందుఁ గాని, రాక్షసరాజగు విభీషణునియందుఁగాని నీ మనస్సునిలుపుము.

శ్లో॥ నహిత్వాం రావణో దృష్ట్వా దివ్యరూపాం మనోహరామ్,
మర్షయేత చిరం సీతే! స్వగృహేపరివర్తనీం. ౨౪.

సీతా! దివ్యమగు రూపముగలదానవు; మనోహరాంగివి, తనగృహమునందె సంచరించుచున్న దానవు నగు

రామభక్తులు తమలోఁ దాము చందా మూలమున వలసినంత రొక్కమును వసూలు చేసిరి. రామలక్ష్మణుల సంతకములతో నొక చీటియు, నాములెయు నెట్లో తానీషా శయనాగారమునం దాతని తలగడం జేర్చబఁడెను. తానీషా నిదురలేచి చూచునప్పటి కచట నీవిషయము నెఱిఁగించువా రెవ్వరు లేరు. రామలక్ష్మణుల చేవ్రాళ్ళుగల లేఖం గాంచి తానీషా విస్మయ మందెను. అప్పటికి రామభక్తుఁడై రామదాసని ప్రఖ్యాతినందిన గోపన్నయొక్క చెఱ విముక్తి గావించెను. ఇది సవిస్తరముగ నెఱుంగఁ గోరువారు "ఆత్మ సామ్రాజ్యము" అను గ్రంథము 30-35 పుటలం జూచెదరుగాక.

నిన్ను చూచి బహుకాలము రావణుఁడు మన్మథబాధ సహించి యుండఁడు. అని శ్రీరామచంద్రుఁడు పలుకఁగా సీత యిట్లు చెప్పుచున్నది.

శ్లో॥ మదధీనంతు యత్తన్మే హృదయం త్వయి వర్తతే,
పరాధీనేషు గాత్రేషు కింకరిష్యామ్యనీశ్వరా. (సర్గ 119.)౯.

ఎయ్యది నాస్వాధీనమునందుఁ గలదో ఆనాహృదయము నీయందె వర్తించుచున్నది. అనాథనగు నేను పరాధీనములగు నంగముల విషయమునందు ఏమిచేయఁ గలను?

ఇఁక అక్కన్నమాదన్నల ప్రతిభఁ గూర్చి "ఆంధ్రవీరులు" అను పొత్తము నం దంత్యపుటలం గాంచవచ్చును.

"ఆకాలమున ఈస్టుఇండియా కంపెనీవారు హిందూదేశమునఁ బ్రవేశించి మదరాసు, మచిలీపట్టణములోనగు చోటులఁ జిన్న చిన్న కొట్లు పెట్టి వ్యాపారము చేయసాగిరి. ఔరంగజేబునకుఁ గంపెనీవారికి నభిప్రాయము భేదించుటచే వారికి నిలువ నీడ దొరకదయ్యెను. అపుడు కంపెనీవారు గోలకొండను సర్వాధికారముతోఁ బరిపాలించుచున్న యక్కన్నమాదన్నల నాశ్రయించి సముద్రతీరప్రాంతమును గౌలునకుఁ బుచ్చుకొని వ్యాపారము చేయ నిశ్చయించి యుపాయాంతరము నన్వేషింపసాగిరి." (ఆంధ్రవీరులు 132పుట,)

"ఇంతలో మాదన్నగారి తనయుఁడగు మల్లప్పయను వాని యుపనయనము సమీపించెను. అది గ్రహించి కంపెనీవారు మాదన్నగారికొక వీసె బరువుగల బంగారుగొలుసులు, నాలుగువందల వరహాలు, అనేకామూల్యములగు పట్టువస్త్రములు బహుమానముగా నొసంగిరి. అంతతోఁ బోక మాదన్నగారి పేష్కారునకుఁ గొంతధనము మాదన్నగారి పినతండ్రిగారికిఁ గొంత రొక్కము నొసంగి యందఱ సంతృప్తిపఱచిరి" (ఆం.వీ. 134 పుట.)

మాదన్న ప్రభృతులకు సంతృప్తి గలిగించినంత మాత్రమున ఈస్టు యిండియా కంపెనీవారి పనులన్నియు చక్కఁబడినవి. ఔరంగజేబునకు నియ్యది యాగ్రహకారణమగునని వేఱ చెప్పనక్కరలేదు. మిగత విషయములం గాంచుడు.

"మాదన్నగారు తన యుపవనములోని సరోవరమున స్నానము గావించుచుండ పూర్వపు సర్వసైన్యనాయకుఁడగు ఇబ్రహీంచేఁ బ్రేరేపితుఁడై వచ్చి యొక తురుష్కుఁడా కొలనులో మునిఁగెను. మాదన్నగారా తురుష్కుని సాహసమునకు మిగుల కోపించి వెంటనే యాతని శిక్షించిరి." "మాదన్నగారి

శ్లో॥ ప్రేషితస్తే యదా వీరో హనుమా నవలోకకః
లంకాస్థాహం త్వయావీర కిం తదా నవిసర్జితా. ౧౧

ఓ వీరుఁడా! నీవునను వెదకుటకు వీరుండగు హనుమంతుని బంపితివే; అపుడు నేను లంకలోను నీ వచటను నుండిన పుడె నన్నేల విడువవైతివి? అని సీత ప్రశ్నించినది.

---

విషయమై తానీషాకుఁ దెల్పినను లాభము లేదని మహమ్మదీయులందరు నిశ్చయించి బ్రాహ్మణమంత్రులచేఁ దానీషా చేయించు దుండగములలో నిది యొకటిగా ఢిల్లీశ్వరునకు నివేదింపుమని వానిని ప్రోత్సహించి పంపిరి.”
(ఆం. వీ. 135. పుట)

ఇనివరకే ఔరంగజేబునకుఁ గ్రోధకారణ మేర్పడినది గదా! దానికిఁ దోడ్డీ మహమ్మదీయని ఘోష అగ్నికి గాలి తోడయినట్లయి వెంటనె ఔరంగజేబు తన కుమారుఁడగు “మువాజం” అను వాని నమితసైన్యముతో. గోలకొండపయి యుద్ధమునకుఁ బంపెను. గోలకొండ గోలకొండ యైపోయినది. యుద్ధము తీవ్రదశకు వచ్చినది. ఆయుద్ధతీవ్రతనుగూర్చి మహారాణులె యోజించి కార్యసాధన మొనర్పవలసినవారైరి. ఆయంశములఁ దిలకింపుఁడు.

“ఈ సంగ్రామమునకు ముఖ్యముగ బ్రాహ్మణులగు అక్కన్న, మాదన్న గారలు మంత్రులుగ నుంటయె కారణమని పరిజనుల వలన విని యంతఃపుర కాంతలు వీరభటులను దానీషాకుఁ దెలియకుండఁ బిల్పించి వారికనేక భూషణముల నొసంగి “యక్కన మాదనగారల వధించి వారితలలఁ గొనిరమ్మని యాజ్ఞాపించిరి. హంతకులు త్రోవలుగాచి దాక్షిణ్యశూన్యులై నిర్దోషులగు అక్కన్న మాదన్నగారల రాజద్వారము ముందఱఁ దెగటార్చి వారి యుత్తమాంగము లంతఃపురమునకుఁ దెచ్చిరి.”

“వెంటనే యంతఃపురకాంతలు ఖండితశిరములనొక వెండిపళ్లెరములో నుంచి మువాజమునొద్దకుఁబంపిరి.అక్కన్న మాదన్నలు వధింపఁబడగనె వీరావేశముతో మహమ్మదీయు లందఱు విజృంభించి గోలకొండలోనున్న బ్రాహ్మణుల నందఱను జెండాడి రక్తప్రవాహములచే దుర్గమంతయుఁ గలుషితము గావించిరి.తానీషామంత్రివర్యులయొక్కయు,బ్రాహ్మణులయొక్కయు దుర్మరణమునకు విచారమునొంది చేయునదిలేక రెండు కోటుల రూపాయ లపరాధము నొసంగి మువాజంతో సంధి గావించు కొనెను.”(ఆం. వీ. 137, 138 పుటలు.)

ఈ ప్రశ్నలో సీతయొక్క మనోగతి యొకింత దృగ్గోచరం బగును. అదెట్లనగా:-సీత లంకలో నుండియున్నప్పుడె రాముని యా శిరస్త్రాణ [illegible] యున్నచో తా నద్దియే నొక నిర్ణయమున [illegible] యు [illegible] తెలియవచ్చెడిని.

మనోగర్భ [illegible] సుందరకాండములో (28-5.) సీత యిట్లు [illegible].

"శ్లో॥ నైవాస్తి నోషా [illegible] పుత్రి [illegible] యస్యా: ప్రియ దర్శనస్య ।
భావం నచాస్యాహ [illegible] మంత్రమివాద్విజాయః"

ఇందుకు [illegible] జనమంచి శేషాద్రిశర్మగారి (ఆంధ్ర శ్రీమద్రామాయణము) చేనాంధ్రీకరించ [illegible] దాహృతము.

"క॥ నేనై [illegible],
గానను [illegible] దీనిం • గనిగి [illegible]
యెం [illegible] వదలక
దానిప్ర [illegible] బలచియోం • ధనువు నిలుపనో;
"క॥ అనియున్న, వేదమంత్రం,
బును శూద్రున కీయందగని • పోలిక భావం
బును వీని రాము సొత్తును,
దనుజున కీయంగజాలం • దగగుత్తికనై."(ఆం.శ్రీ.రా.)

"శ్రీమదాంధ్రవాల్మీకి రామాయణము" (మందరము) నందలి ఆంధ్రీకరణ మిటం గాంచుడు.

"ఉ॥ చూడగనైనరాని నర • సూచను కోతకు నగమాచు న
లాడుటకంటెఁ బాపమగు • నాయురిపోతల నేను ప్రాణముల్
వీడుట; శూద్రజాతునకు • విశ్రుత మంత్ర మొసంగి పాపియై
పాడబున్నట్లు [illegible] దగ • వాముని సీతు నిశాట చేతమల్."

నకు నాటపట్టై నట్లు గోచరింపం గలదు. నవ్వులాటలో "అన యము భూసురులటంచు ననుచుంద్రు కదా" అనే ముఖ్యాంశ మునాధారముఁజేసికొని యిట్టి విపరీతగ్రంథములను వ్రాయ తలసిన పని యితని కేమిపట్టినది యని తలంపవలసియున్నది. పాఱులు తాము "నేఁడుఁ దొల్లి" అనేక విధముల భూసురు లనుకొన్నను మఱి యే సురలనుకొన్నను బాధకము లేదు. కాని వారలం దొక కొందఱు ధర్మశాస్త్రాది పురాణములలోఁ గూడ స్వార్థ పరతననుసరించి రాజశాసనములం బోలిన సూత్రములం గొన్నిం టిని సంధించుచుండిరి. ఇందు వారి గణ్యతకొఱకై యితరు లకు సాంకర్య మాపాదింపఁ దలంచిన ట్లున్నది. ఉదాహరణము నకీ యిరువది శతాబ్దములోఁ గూడ "కంటరాజవాగ్రజః" అను పేరిట నొక పొత్తమును జానపాటి పట్టాభిరామశాస్త్రి యను నొక భూసురుఁడు రచించి ప్రచురించుట గమనార్హము. అం దొతఁ డుదాహరించి (అంగీకరించి)న పద్యము లందొక గొన్నింటి నిట గాంచ వచ్చును.

"సీ॥ బ్రాహ్మణ స్త్రీయందు ప్రభవించు సూతుండు
క్షత్రియ పురుష సంసర్గమునను
బ్రాహ్మణస్త్రీయందుఁ బ్రభవించు రజకుండు
సూతరేతః ప్రణిపాతమునను
బ్రాహ్మణస్త్రీయందుఁ బ్రభవించుఁ జర్మకృ
దధముఁడౌ రజకుని యాధనమునను
బ్రాహ్మణస్త్రీయందుఁ బ్రభవించు నటుఁడును
జర్మకృత్సాంగత్య కర్మమునను

"గీ॥ అగ్రజాతిదైన యంగన హీనులం
దగిలిపడియు నిట్టి తనుభవులను
జెట్టు చెడిపోవునాఁడు పుట్టించు చుండునే
తుచ్ఛమూర్తి పిండె లోకము చెడిని."

సీ॥ కనును దద్బ్రాహ్మణపతియే మాగధు
వైశ్యులోనగు సహోదర [illegible]
బడయుఁ దద్బ్రాహ్మణ యువతియే శూద్రుఁ
బురుషుని ద్వేషనా [illegible]
బడయుఁ దద్బ్రాహ్మణ భామయే బురుషుని
మాగధ సాంగత్య మహిమ వలన
నొందవుఁ దద్బ్రాహ్మణయువతికే మేదుండను
కైవర్తకూటమి గలుగు కతన

ఆ॥వె॥ భిల్లుఁడవరజునకు భిల్లుచేఁ జండాలుఁ
డవ్వధూటియందు నవతరించు
బ్రాహ్మణియ సృజించుఁ బలుజాతు లీరీతి
బ్రాహ్మణాదికులుల బ్రహ్మవోలె."

ఆ॥వె॥ తెలిపినాఁడ నీకుఁ ద్రేతాయుగస్థితి
యున్న దున్నయట్టులో బిడౌజ..." (అంటరానివాండ్రు)

బిడౌజునకు నాంగీరసుఁడు త్రేతాయుగస్థితి యనుచుఁ జెప్పిన పై ధర్మసూత్రములు స్కాందపురాణాంతర్గత నాగరఖండ 27 వ అధ్యాయమును నాంధ్రీకరించుటలోఁ గనుపట్టినవి. కావున నీసూత్రములతోఁ బట్టాభిరామశాస్త్రియు నుత్తరవాది కాకపోయెను.

ముగఁ బ్రస్తుతము దొరకుట లేదు. నా మిత్రులు కొందఱా గ్రంథములోని కొన్ని యాశ్వాసములు చూచినట్లు చెప్పియున్నారు. కాని వారికే యది రామకృష్ణునికవిత్వమని చెప్పఁదగినట్లుగాఁ గనుపించలేదని చెప్పియున్నారు." (క. జీ. 193 పుట.)

పాండురంగవిజయము నందలి కొన్ని యాశ్వాసములు పఠించియున్న తన మిత్రులే రామకృష్ణకవి విరచితమది కాదన్నట్లు చెప్పుచుండినట్లు తెలియవచ్చినది. మఱియు సాంప్రదాయజ్ఞుల యభిప్రాయములుకూడ సంపూర్ణముఁ బ్రబలముగనే యున్నవి కదా! చూడుడు.

" రామకృష్ణునిచే రచింపఁబడిన గ్రంథము పాండురంగ మాహాత్మ్యమేకాని విజయము గాదని సంప్రదాయజ్ఞులైన పురాతన పండితుల యభిప్రాయము." (క. జీ. 194 పుట.)

పురాతనపండితుల యభిప్రాయమనియుఁ దమ మిత్రులే చెప్పుచున్నారనియుఁ జెప్పుచు నా విషయము వెఱ్ఱితోవం బట్టింపఁ జూచు టెంతయు నవివేకమని చెప్పక తప్పదు. "పాండురంగ విజయము" ప్రామాణిక గ్రంథము కాఁ జాలదనుటం గూర్చిన యీ క్రింది యంశముం దిలకింపుఁడు.

" అప్పకవీయాదిగ్రంథములలోఁ బాండురంగ క్షేత్ర మాహాత్మ్యములోని పద్యములే గ్రహింపఁబడి విజయములోని పద్యము లేలగైకొనంబడవు. కావున విజయమను గ్రంథమును మాహాత్మ్యగ్రంథము వలెనే ప్రామాణిక గ్రంథమని కాని, మాహాత్మ్య గ్రంథకర్తయగు రామకృష్ణకవి విరచితమని కాని యంగీకరింపఁ జాలము" (క. జీ. 194 పుట)

నిజమునకు పాండురంగవిజయము రామకృష్ణకవి విరచితము కానేరదని చెప్పవచ్చును. కాని యీ కబ్బము ప్రామాణిక గ్రంథము కాజాలదనినట్లు వ్రాయుటలో నప్పకవీయాది గ్రంథములను జేర్చుటచే నవ్వాని యోగ్యతఁగూడ గొంత నిటు జర్చింపక తప్పినదికాదు. అప్పకవీయమునందుగల "సుకవి లక్షణముం" గాంచుఁడు.

"క॥ ధరణీసురుఁడు ప్రశాంతుఁడు
గురుభక్తుఁడు శుచియు గల్పకుఁడు ప్రాచ్యకవీ
శ్వరు వాక్ప్రయోగ దక్షుఁడు
గరుణామయుఁ డవ్వఁడతఁడె 'కవి' యనఁ బరఁగున్.

(అ. క. ప్ర. 44)

ప్రశాంతాది సద్గుణము లీ యప్పకవికి యున్నను తేకున్నను దాను మాత్రము ధరణీసురుఁడను గర్వముతో 'కవి' యనంబరఁగినాఁడు. అంతే కాదు, తన కబ్బమునకు "అప్పకవీయ" మనిపేరు పెట్టినాఁడు. ఈతని దృష్టిలో ధరణీసురేతరు లెంత ప్రశాంతాది సద్గుణోపేతులైనను, వాక్ప్రయోగదక్షులైనను గవులనంబరఁగుటకేని యవకాశము లేనియట్లు; తన కవితాలక్షణములో చెప్పికొని యున్నాఁడు. భూసురేతరులలో ననేకులు మహాకవులున్నారు. ఉదాహరణమున కొక మాఘకవీంద్రునిం గూర్చి గమనింతము గాక.

## మహాకవి మాఘుఁడు.

( వైశ్యోత్తముఁడు )

మాఘుఁడు మహాకవి, వైశ్యోత్తముఁడు, ప్రశాంతాది సద్గుణోపేతుఁడు. ఈతని చరిత్ర పరిశీలనమున ననుదినము

"భిక్షాం దేహి" యన్నట్లు పరులను యాచించుటయె వృత్తిగాఁ గల పాలుల ప్రభావముకూడ యొక్కింత వేద్యము కాకపోదు. చూడుఁడు "మాఘ (సంస్కృత) కావ్య" ముపోద్ఘాతము.

శ్లో॥ శ్రీమాఘోస్తాఘధీః శ్లాఘ్యః ప్రశస్యః కస్యనాభవత్.
చిత్తజాడ్యహరాయస్య కావ్య గంగోర్మి విప్రుషః॥
తథా శుభంకర శ్శ్రేష్ఠీ విశ్వ విశ్వ ప్రియంకరః,..."(మా.పీఠిక.)

పుణ్యవంతుఁడును, శ్లాఘ్యుఁడును మహనీయుఁడును నగు మాఘు కవినిఁ గొనియాడనివా రెవరున్నారు? ఆమహనీయుని కావ్యామృతబిందువులు గంగాజల కణములవలె సర్వజనుల చిత్తజాడ్యములను హరించును. అట్టి శుభకరుఁడైన శ్రేష్ఠి సర్వత్ర పూజ్యుఁడు.

పై శ్లోకములు ప్రభాచంద్రకృత; ప్రద్యుమ్నసూరి పరిశోధిత "ప్రభావక చరిత్రము" నందును నుదాహృతంబైనట్లు తెలియం గలదు.

మేరుతుంగాచార్య విరచిత "ప్రబంధ చింతామణి" యందును మాఘుని చరిత్రము సవిస్తరముగ వ్రాయఁబడినట్లు తెలియుచున్నది. అందు గుజరాతి కనతిదూరంబున"భిన్నమాల" లేక "శ్రీమాల" యను నగరం బున్నట్లును నయ్యది మాఘ పండితుని వాసస్థల మగుననియుఁ దెలియఁ గలదు.

పంచకావ్య కర్తలం దొకండగు మాఘకావ్యప్రణేత యొక్క పాండిత్య విశేషముల నెఱుంగనివారీ యాంధ్రదేశంబునఁ బెక్కు రుండరు. ఇందుఁ గూర్చి ప్రాచీనకవు లనేకవిధములఁ బ్రస్తుతించి యున్నారు.

"శ్లో॥ ఉపమా కాళిదాసస్య భారవే రర్థగౌరవమ్
దండినః పదలాలిత్యం మాఘేసంతి త్రయోగుణాః."

మఱియొకకవి యిట్లు చెప్పుచున్నాఁడు

శ్లో॥ "నవసర్గే గతే మాఘే నవశబ్దో నవిద్యతే"

మాఘకావ్యమునఁ దొమ్మిదవ సర్గవరకుఁ బఠించినచో నందుఁ బ్రయోగింపఁబడని క్రొత్తదగు శబ్దము సంస్కృత వాఙ్మయమునందు వేఱొంటను వెదకిచూచినను గానరాదు.

మాఘకావ్య వ్యాఖ్యానములలో మహామహోపాధ్యాయ, కోలాచల మల్లినాథసూరి విరచిత "సర్వంకష" యను వ్యాఖ్యానమె వాడుకయందెక్కుడు గనుపించుచున్నది. ఆ వ్యాఖ్యాత పీఠికయందిటుల వచించెను.

శ్లో॥ "ధన్యో మాఘకవిః వయం చ కృతినః తత్సూక్తి సంసేవనాత్"

మాఘుడు ధన్యుఁడు. మేముగూడ నామహాత్ముని పుణ్యవాక్కుల సేవించుటచే ధన్యులమైతిమి. మఱియు శబ్దార్థముల రెండింటిని నతి నిపుణతతోఁ బ్రతిపాదించినాఁడు. అని వినుతించియుండెను.

శ్లో॥ "శబ్దార్థౌ సత్కవిరివద్వయం విద్వా నపేక్షతే"

మాఘపండితుఁడు తన వంశాభివర్ణనమునందాను ఘూర్జర దేశవాసి ననియు, సుప్రభదేవుండను వైశ్యునకుఁ బౌత్రుఁడననియు, దత్తకుండను మహాశయుని పుత్రుఁడననియు వ్రాసికొని యుండెను.

మాఘుఁడు కేవలము కవిమాత్రమెకాక దానకర్ణునకైనయగు గొప్పదాత. "బ్రాహ్మణులము మహారాజా!" యని తమ పొట్టలుబ్రద్దలగు నన్నంతవరకు విడువనొల్లని జలగలవంటి యాచకుల బారింబడిపడి తుదకు వారిమూలముననె తన యసువులంగూడఁ గోలుపోయిన మహాత్యాగి.

బలిచక్రవర్తింబోలిన యీ మహాత్యాగికి, వాచస్పతి వంటి యీ మహాపండితునకు నర్ధాంగి, సహధర్మచారిణి, యంతకంటె నెక్కుడు సుగుణ గణోపేత సూరిజనస్తోత్రపాత్రి విద్యావిశారద యగుసాధ్వియబ్బుట సువర్ణమునకు సువాసన యబ్బినట్లు ముదావహముగదా? ఈ పుణ్యదంపతుల సునా యాసముగఁ గడతేర్చిన యీయాచకులనేమని యనవలెను. ఈ దంపతులంగూర్చి "భోజప్రబంధము"నందలి యీ క్రింది యంశములంగాంచుఁడు.

"ఒకానొక దినమున ద్వారపాలకుఁడు భోజుని సమీపించి స్వామీ! ఘూర్జర దేశవాసియు, మహా పండితుఁడు నగు మాఘుఁడు త్యాగశీలతచేత సర్వవిభవమంతయు నర్థిజనులకొసంగి ప్రస్తుతము దారిద్ర్యపీడితుఁడగుటచే దను దర్శనార్థియైవచ్చి నగరబహిర్ద్వారమున నుండెను. ఆయన యనుజ్ఞవడసి యీ మహానుభావునిభార్య సభాప్రవేశమును గోరుచున్నదని విజ్ఞాపన మొనర్చెను. అంత నారాజామెను రప్పింప నామె స్వభర్తృ కృత శిశుపాలవధాంతర్గతమగు నొకానొక శ్లోకముగల తాళపత్రమును రాజునకీయ నాతఁడా ప్రభాత వర్ణనపరమగు

"శ్లో॥ కుముదవన మపశ్రి శ్రీమదంభోజషండమ్,
త్యజతి ముదముతూకః ప్రీతిమాంశ్చక్రవాకః
ఉదయమహిమరశ్మిర్యాతి శీతాంశు రస్తం,
హతవిధిలసితానాం హీ విచిత్రో విపాకః" (11 సర్గ 64 శ్లో)

సూర్యుఁ డుదయించుటచే నంతకుం బూర్వము శోభా విరహితమైన పద్మసమూహము శోభావంతమై యానంద మొసంగు చున్నది. చక్రవాకము రాత్రి యంతయుఁ బ్రియా వియోగముచే భిన్నమగుటంజేసి సూర్యుఁ డుదయించుట

తోడనే యత్యంతానందము నొందుచున్నది. ఇంక చంద్రుఁడ స్తమించుటంజేసి యంతకుముందు శోభాయమానమై నేత్రానందము గొల్పెడి కుముదకదంబ మిపుడు ముకుళితమై శోభావిముక్త మగుచున్నది. రాత్రి యంతయు ననేక జీవముల నాశమొనర్చి యమితానందము నొందిన గుడ్లగూబ దివాంధమగుటచే నత్యంత దుఃఖము నొందుచున్నది. చక్రవాక మానందించుచున్నది. ఆహా! ఏమి? యీహితవిధి విలాసముల పరిణామము!

ఈ వర్ణనముగాంచి యమందానంద భరితాంతరంగుఁడై మాఘుఁడు లక్షల రూప్యముల నొసంగి యీ రూప్యములను భోజన సౌకర్యముల కొరకై యిచ్చితిని. ప్రాతఃకాలముననే నా మహామహుని దర్శనార్థమై వచ్చెదనని యామెనుబంపెను.

ఈయమ నగర బహిర్ద్వారముకడనున్న తనభర్త కడకుఁ జనులోపలనె కుక్షింభరులగు యాచకులు వెన్నంటి యామాఘుఁడు లక్షల రూప్యములను దోఁచుకొని నట్లుగాఁగల యీ క్రింది యంశములఁ దిలకింపుఁడు.

"ఆ సాధ్వి రాజుసన్నిధి నందినధనము తెచ్చుచున్నదై మార్గమధ్యమున మాఘుని యశస్సును యాచకులవలనవిని వారిచేఁ బ్రార్థింపఁ బడినదై యాధనమంతయు వారికొసంగెను"

ఆవిషయ మెఱింగిన యనంతర మా మాఘుఁడు మిక్కిలి సంతోషించియు, పాపభీతిలేని యాయాచకులంగూర్చి పడు పరితాపము గాంచఁ దగినది.

"భర్తను సమీపించి యా యుదంతమంతయు విన్నవించెను. మాఘుఁ డదివిని యద్భుతానంద భరితుఁ డాయెను.

కాని మఱల యాచకులకియ్యఁ దనవద్ద నేమియు లేకుండుటఁ జేసి చింతిల్లందొడంగెను"

మఱునాఁటి ప్రాతఃకాలమున రాజుసందర్శనంబిచ్చుననియు దాన వలసినంత ద్రవ్యము లభ్యము గావచ్చుననియు మాఘునకుఁ దెలియవచ్చెఁగదా! ఇంతలోనే యాచకులనుగూర్చిన చింత! అదియట్లుండ యాచకులప్పటి కవులు మరలఁ బ్రత్యక్షమై మాఘునిట్లభివర్ణించుచున్నారు.

శ్లో॥ "ఆశ్వాస్య పర్వతకులం తపనోష్ణతప్తం,
ఉద్దామదావ విధురాణి చ కాననాని,
నానానదీనద శతాని చ పూరయిత్వా,
రిక్తోఽసి యజ్జలదవత్త వచోత్తమ శ్రీః."

పర్వతశ్రేణికి ఎండవలనఁ గలిగిన తాపమును, దావాగ్ని చే దహింపఁబడు కాననముల దాహమును శమింపఁజేసి యనేక నదములఁ బూరించి జలశూన్యమైన మేఘునివలె నీవు నీవిభవమంతయు నర్థిజనులకిచ్చి రిక్తుండవైతివి; ఆహా! మేఘునకును నీకును సమానమగు కీర్తియనుట నిస్సందేహమైనమాట.

మేఘము లోకప్పుడు జలశూన్యమైనను మఱల మఱల జలమును బూరించుచుఁ బ్రపంచమునకు వలసినంత నీరు నింపుట స్వభావసిద్ధమైయున్నది. అట్లె మాఘుఁ డప్పుడప్పుడు నిర్ధనుండైనను మఱల మఱల నెంతేని ధనము గడింపఁగలఁడనియు నందువలనఁ దమవంటి యాచకులకుఁ బండినపంటయగు ననియు ధ్వనించుచున్నది.

మాఘునకామాత్రము తెలియకపోదు. కాని, సభావేదికయందుండి రాజొసంగినద్రవ్యము హజారమునందున్న తనకుఁ జేరకపూర్వమె హరియింపఁబడియె. ఇఁక ప్రాతఃకాల

మున రాజాసంగునది మాత్రము వీరిముందఱ నిలచుట కవకాశ మున్నదా! లేదు. కుమార్తెకిని లేదు; అనుచు మాఘపండితుని మనస్సును వేగిరపెట్టినది. అందుచే నిట్లారాటపడఁదొడఁగెను.

శ్లో॥ “అర్థానసన్తి నచముంచతిమాం దురాశా,
త్యాగాన్నసంకుచతి దుర్లలితం మనోమే.
యాచ్ఞాచ లాఘవకరీ స్వవధేచ పాపం,
ప్రాణాః స్వయం వ్రజత కిం నువిలంబితేన”

ధనములేదు. నన్ని దురాశవిడుచుట లేదు. చెడ్డదగు నా మనస్సుమాత్రము త్యాగశీలతనుండి మరలుట లేదు. యాచన లాఘవమును గలుగఁజేయును. ఆత్మహత్యవలనఁ బాపము సంభవించును. ఓ ప్రాణములారా! శీఘ్రమెపోండు ఆలసించినఁ బ్రయోజనము లేదు.”

యాచకు లతిలాఘవమున వంచింతురనియు, నట్టివంచన పడుటకన్నను బ్రాణములనె పారద్రోలుట మేలనియు నీమాఘ కవి తలంచినాఁడు. తలఁచుటయుకాదు. నిముసములపైఁ దన యసువులఁ దరలించినాఁడు. త్యాగశీలతకు బద్ధుఁడగుట చెడ్డయని పరిపరివిధములఁ బరితపించినాఁడు.

శ్లో॥ “దారిద్ర్యానలసంతాపః శాంతః సంతోషవారిణా,
యాచకాశా విఘాతాంతః దాహః కేనోపశామ్యతి.”

దారిద్ర్యాగ్ని వలనఁ గలిగిన సంతాపము సంతోష వారిచే శమించినది. కాని యాచకులయాశను నిర్మూలించుటచేఁ గలిగినదాహము దేనిచే శమించును?

“శ్లో॥ నభిక్షా దుర్భిక్షే పాతి దురవస్థాః కతివృణం
లభన్తే కర్మాణి ద్విజపరివృఢాః కారయతి కః?
అరణ్యే ప్యగ్రాసం గృహపతి గసౌ నస్తమయతే
క్వయామః కిం కర్మ ప్రియగృహిణి! గహనో జీవనవిధిః.”

గృహిణీ! కాటకమునందు భిక్షుకుడను. దురవస్థలుగల వారికెట్లు ఋణము లభించును? ద్విజపరివృఢులచే (వైశ్య శ్రేష్ఠులచే) ఎవడు పనులు చేయించును? అదిగో! సూర్యుడు అస్తమించుచున్నా డన్నము సిద్ధ్యం రమో! జీవనవిధి దుస్తర మయినది. ఎక్కడకుపోవుదము - ఏమిచేయుదము!!

అని చింతించు మాఘునిద్వారాల కేతెంచియున్న యాచకులు నిరుత్సాహులై వెడలిపోయిరి. అంతట కొంతవడికి

"శ్లో॥ వ్రజత వ్రజత ప్రాణా అర్థిని వ్యర్థతాంగతే,
పశ్చాదపి హి గంతవ్యం క్వసార్థః పునరీదృశః."

మాఘపండితుడీ శ్లోకము పఠించుచు పరలోకమునకు జేరెను.

అనంతరమా మాఘకవిపత్ని యీక్రింది శ్లోకమురచించి యాచరిత్ర మాచంద్రార్కమొనర్చినది.

"శ్లో॥ సేవన్తేస్మ గృహం యస్య దాసవ ద్భూభుజః పురా,
సో అద్య భార్యా సహాయోఽయం మృతో మాఘపండితః"

పూర్వమే మహాత్ముని గృహము ననేక రాజులు సేవించిరో, అట్టి మాఘపండితుడు భార్యామాత్ర సహాయుడై పరలోకము నందెను."

భార్యామాత్రసహాయుడై యనుటచే మాఘుని యంత్యకాలమున నా యాచకులుగాని మఱింకెవ్వరుగాని యేవిధమైన సానుభూతిగూడ చూపినట్లు లేదు. కవిసందర్శనమునకై గంపెడాసతోనున్న రాజునకు మాఘపండితుని యంత్యక్రియలొనర్చుట యబ్బినది.

"ఈ వార్త వినిధరాధీశుం డనేక బ్రాహ్మణులతోగూడి పాదచారియైవచ్చి మాఘునిశవమును నర్మదానదీతీరమును

జేర్చెను. అంత మాఘుని పత్ని సహగమన మాచరించెను. రాజా పుణ్యదంపతుల మరణమున కెంతయుఁ జింతించి పుత్రుని వలెఁ బారలౌకికక్రియల నాచరించెను."

రాజు మాఘపండితునకు నుత్తరక్రియల నొనర్ప సంసిద్ధుఁడగుట నాయాచకు లెరింగి గోభూసువర్ణాది మహాదానములను స్వీకరింప సంసిద్ధులైరి. "ధరణీసురు" లనంబఱగి నంత మాత్రమునం బ్రయోజన మేమి? యాచించుటలోఁగూడ పాపభీతి పశ్చాత్తాపము లుండవలదా? ఇక మల్లారెడ్డియను నాంధ్రకవీశ్వరుంగూర్చి కొంత ముచ్చటింతుగాక!

## ఆంధ్రమహాకవి, మల్లారెడ్డి
### (భానుకేతరుఁడు)

ఆంధ్రమునందు మల్లారెడ్డియను నొక మహాకవి షట్చక్రవర్తి చరిత్రమను నెనిమిదాశ్వాసముల కబ్బమును రచించినట్లు తెలియంగలదు. అద్యది యింకను తాళపత్రస్థముగనె యుంట విచారకరము. ఆకావ్యమునుగూర్చి యాంధ్రకవుల చరిత్రము (ద్వి. భా.) నందిట్లు వ్రాయంబడి యున్నది.

షట్చక్రవర్తుల చరిత్ర మనంబడు "దీనిని తాళపత్రముల మీఁద వ్రాసినవారే హేతువు చేతనో కృత్యాది పద్యములను వదలివేసి షష్ఠ్యంతములు మొదలుకొని వ్రాసి యున్నారు."
(ఆ. క. 314 పుట.)

కృత్యాదిపద్యము లేహేతువుచేతనైననేమి గ్రంథస్థములు కానందుకు విచారింపనలసి యున్నది. కృతికర్తనుగూర్చి ప్రత్యాశ్వాసాంతము నందును గల గద్యమా మల్లారెడ్డింగూర్చి తెలిసికొనఁదగి యున్నది.

గద్యమునందు మల్లారెడ్డి "కాచభూపాలు"ని పుత్రుండని గలదు. కాచభూపాలుడు ధరణీశ్వరుఁడే యగుట మల్లారెడ్డియు ధరణీశ్వరుఁడే (భూసురేతరుఁడు)కావలెను. ఆ హేతువుచేత నెఅప్పకవివంటివాఁడే వ్రాయసగాఁడై నను కృత్యాదిపద్యములను బుద్ధిపూర్వకముగ నె వ్రాయుటయందు వదలుట సంభవించును. అయిన నేమి? కవిత్వము రసవత్తర మైనదగుట నాశ్వాసమున కొకటి రెండు పద్యముల చొప్పుననైన నాంధ్రకవుల చరిత్రము నందుదాహరింపంబడి యుండుట ముదావహము. ఆపద్యముల నొక కొన్ని యుచ్చునవి.

సీ॥ గోపురగోపుర గోపుర ప్రతిమంబు
కల్పద్రుకల్పద్రు గౌరవంబు
మానవ మానవ మానవాభ శీయంబు
మణిజాలమణిజాల మంజిమంబు
సారంగసారంగ సారంగనయనంబు
సుమనోబ్జసుమనోబ్జ శోభితంబు
బహుధామ బహుధామ బహుధామ చిత్రంబు
ఘనసార ఘనసార గంధిలంబు

గీ॥ భవ్యకాసార కాసార బంధురంబు
జనన సైంధవ సైంధవ సంకులంబు
బహుళ కేతన కేతనభద్రలంబు
నై విజృంభించె సిరి నయోధ్యాపురంబు." (౧. ఆ.)

చ॥ అతను వియోగతాపమునిజాంగమునం దగనిండియుండఁగా
నతివ సతృష్ణయై నలకథామృత మొంతయు గ్రోలెనందునన్
మిత మెడలన్వెసన్ జ్వరము మించెనటంచును దత్సఖీభిష
గ్వితతులు దానికిం దగు చికిత్సలు చేయఁదొడంగి రత్తటిన్ (౪.ఆ)

సీ॥ "గోరక్షణముఁ జేయు శౌరి యుండుటఁ జేసి
గోరక్షణముఁ జేయుఁ గోర్కె మెఱసె
బుధులఁ బ్రోచెడు చతుర్భుజుఁ డుండుటను జేసి
బుధులఁ బ్రోచుచు నుండు బుద్ధిమించె
సత్యానురక్తుఁడౌ చక్రి యుండుటఁ జేసి
సత్యానురక్తుఁడై చాల వెలసె
బలభద్రయుతుఁడు శ్రీపతి యుండుటను జేసి
బలభద్రయుక్తుఁడై ప్రజ్ఞ మీఱె
గీ॥ సారంగ పురుషోత్తముఁడు ప్రాణవిధుఁడౌటఁ జేసి
తాను బురుషోత్తముండన ధాత్రి నొప్పె
భవ్య లక్ష్మీవిలాస విభ్రమము లలరు
చక్రధరమూర్తి పురుకుత్స చక్రవర్తి." (౬. ఆ.)

మాఘుఁడు, మల్లారెడ్డి వంటిసంస్కృతాంధ్రమహాకవులనే నిరసనసేయుక అప్పకవి* ధరణీసురుఁ డెవ్వఁ డతఁడె "కవి" యన బఱగుక్త అనినిర్వచించి యుండెనందుచేత నాయాగణ్యతఁ గూడ కొంత విమర్శించి యుంటిమి. ఇట్టి యనవానాత్ములు "శ. విజయ" కృతికర్తయే రచించి యున్నట్లు గల పాండురంగ విజయమునందలి పద్యాదుల నెట్లుదాహరింపగలరు? అప్పకవి యాదులు "శ. విజయము" నందలి పద్యాదుల నుదాహరింప నంతమాత్రమున నా. శ. విజయము ప్రామాణ్య విహీనమై భూలోకమునుండి తొలఁగిపడ లేదు. అనేక చోటులం దచ్చుప్రతు

* అప్పకవి "కవికల్పకము" అను మఱియొక పొత్తముగూడ వ్రాసియున్నట్లు తెలియ వచ్చుచున్నది. అయ్యది పట్టికలో గూడ నున్నట్లు కానఁబడదు. పాండురంగ విజయమున్నట్లు పలు గ్రంథములందు గన్పట్టుచునే యున్నది.

ప్రేలబడనాయె పసలేక నేలప్రాలె
నెంతని గణింపఁ గలను తత్కాంత సొగసు.

(పాండురంగవిజయములోని దని వాడుక)

పాండురంగ విజయమునందు నిండు నిండు ఛలోక్తులు ప్రయోగింపఁబడినట్లు "నాగ్నజితీపరిణయము" నందాకృతికర్త నల్లూరి నరసింహాకవి తెనాలి రామలింగకవిమీఁదనున్న సభవర్ణించుచూ వ్రాసినట్లుగల యీ క్రింది పద్యము చూడుఁడు

ఉ॥ "రంగుగఁ బాండురంగని తె ♦ లుంగలరంగ రచించి వేడ్కమీ
ఱంగ ఛలోక్తులన్ నృపుగ ♦ రంగనొనర్చు హారంగునింగి ము
ట్టంగ మెలంగు నేరుపుఁగడంగి చె ♦ లంగు సభంగ సత్య శో
లింగుని రామలింగ కళ ♦ లింగకళానిధినిన్ గణించెదన్"

సరస్వతి సోమయాజికృత "ప్రభుచరిత్రము" నందు రామలింగకవిని గూర్చిన యీ క్రింది పద్యము కలదు.

"క॥ శృంగార రసాలింగిత
రంగత్కవితావనీత ♦ రంగము హృదయ
త్వంగద్భుజంగ మాంగద
లింగమ్ము తెనాలిరామ ♦ లింగమునుఁ దలఁతున్"

మఱియు రాజలింగ కవికృత కూర్మ పురాణమునందు "రంగనాథుని రామలింగకవిని" యని స్తుతియుఁ గలదు.

ఇందెందుఁ గాని రామలింగకవికి రామకృష్ణకవియను మఱియొక నామమున్నట్లు కన్పించదు. అటులనె రామకృష్ణకవికి రామలింగమనుపేరున్నట్లుఁ గూడ నెందును గానరాదు. రామకృష్ణుఁడు తాను రచించిన పాండురంగ మాహాత్మ్యమునందైనను రామలింగమను పేరొకటి తనకుఁ గల్గియున్నట్లు తెలుపుకొనలేదు.

జగ్గనకవి కృతమగు "చంద్రరేఖా విలాపము"నందుఁ బ్రథమాశ్వాసమున సుకవిస్తుతిలో

"క॥ భీమకవి రామలింగని
శ్రీమన్మథుఁడై చెలంగు • శ్రీనాథకవిన్
రామకవిముఖ్యులను బ్రో
ద్దామగతిన్ జిత్తవీథిఁ దలఁచి కడంకన్." (చం.వి.ప్రరి)

ఈ పద్యమునందు రామలింగకవి, రామకవియను వారి ఉభయు పేర్కొనఁబడినారు. రామలింగకవి తెనాలి రామలింగ కవియనుట నిర్వివాదాంశము. ఇఁక రామకవియనువాఁడు గార్లపాటి రామకృష్ణకవి యగునేమో యని తోఁచెడిని. రామలింగ కవియు, రామకృష్ణ కవియును బూతు పాండిత్యమునకుఁ బ్రసిద్ధులను నైతిహ్యములనుబట్టి బగన తెనబూతుగాథకునామో నీయిరువురను జేర్కొని యుండనోపును.

శ॥ విజయ కృతికర్తయే. పాం॥ విజయకృతికర్త
(తెనాలి యగ్రహార ప్రసక్తి)

శ. విజయ కృతికర్తయే పాండురంగ విజయమును రచించి యున్నట్లీ క్రింది పద్యము రూఢిచేయుచున్నది.

"గీ॥ పాండురంగని విజయంబుఁ బలికి ధీర
జన మనోరంజనముఁ జేసి జగతి కాది
కారణంబైన వేరొక కథ రచించి
శమ్నవిజయంబుఁ జెప్పితి సత్య మనుచు." (శ.వి. 129)

" సత్యమనుచు " శ. విజయమును చెప్పితి నను చున్నాఁడు. అనఁగా పూర్వులొక కొందఱు తా మేకథ కల్పించినను దానిని సత్యమనుటయు దానిని జదివినవారు నయితము

సద్గతి నందఁగల రసుటయుఁ బరిపాటిగా నున్నది. అట్లె యున శ. విజయ కృతికర్తయు నుడివిన ట్లూహింపవలెను. ఈకృతి కర్తయె తెనాలిని శ్రీకృష్ణదేవరాయని వలన యగ్రహారముగ బడసినట్లు అందలి గద్యయందు దానే వ్రాసికొని యున్నాఁడు. చూడుడు. శ. విజయము నందలి గద్య.

"ఇది యయాదిపురాణాది బహుగ్రంథకార కృష్ణరాయ దత్త తెనాల్యగ్రహార తెనాలివంశ పవిత్రార్య కనస్తోత్ర మల్లికార్జున తనూభవ రామలింగ నామధేయ ప్రణీతంబగు శశ విజయంబను మహాప్రబంధంబు." (శ. వి. గద్య.)

శ. విజయకృతికర్త తాను మల్లికార్జున తనూభవుఁడ ననియు తెనాలి వంశీయుఁడ ననియు కృష్ణదేవరాయుల వలన తెనాలి యగ్రహారముగా బడసితి ననియు రామలింగ నామధేయుఁడ ననియు చెప్పికొని యుండినను నా శ. విజయమును ప్రచురించినవారు కవిచరిత్రము నాధారముగా "రామకృష్ణకవి" ప్రణీత మని చెప్పుట, లిఖితప్రతులు గలిగినచో, నట్టి వానిని కృత్రిమ ప్రచురణము లని భావింపవచ్చును. ఆ యకృత్రిమములగు ప్రచురణముల కీట పర్యాలోకన మొనర్చి ఖండించవచ్చును.

చరిత్ర పరిశోధనమైన కృత్రిమప్రచురణము లన్నియు బహుముఖముల గలవు. "ఆంధ్రకవుల చరిత్రము" నందును "కవి జీవితము" లందును మఱియు నితర మనేక గ్రంథములందును శ. విజయాది గ్రంథకర్తయైన రామలింగకవికిని; పాండురంగ మాహాత్మ్య గ్రంథకర్తయైన రామకృష్ణకవికిని గల వ్యత్యస్త చరిత్రాంశములను పాటింపక రెండువురను నొకేవ్యక్తిగ పరిగణించుచు వ్రాసియున్నప్పటికిని నిజమును నిరూపించుటను నందందు

నవకాశము లేకపోలేదు. ఉదాహరణమున కొక యింటిపేరును గుఱించి విచారింతుము గాక. "ఈశ్వరప్రభ" "ఈశ్వరప్రగడ" యను ప్రచురణములం గాంచుచున్నాము. ఇది యింటిపేరు కానేరదు.

## కృత్రిమప్రచురణ ఖండనము

### (విషయ విమర్శనము)

రామలింగకవి లేక రామకృష్ణకవి యింటిపేరు "ఈశ్వర ప్రగడ" యని కవి జీవితములందును వ్రాయఁబడినది. (మహా. క. జీ. 199 పుట.) శ్రీ. విజయరాఘవ గ్రంథకర్తయైన రామలింగ కవి తాను తెనాలి వంశీయుఁడ నని చెప్పికొనెను. పాండురంగ మాహాత్మ్య గ్రంథరచయితయైన రామకృష్ణకవి తాను గార్లపాటి వంశీయుఁడ నని చెప్పికొని యున్నాఁడు గాని ఈ యిరువురిలో నెవ్వరుగాని తాము ఈశ్వరప్రభ లేక "ఈశ్వర ప్రగ్గడ" వంశీయుల మని చెప్పికొని యుండలేదు కాబట్టి చరిత్ర పరిశోధనమున నీ "ఈశ్వరప్రగడ" యను పేరు యీ యిరువురి లో నెవరికిని యింటిపేరు కాజాలదని యెఱింగింపఁ బడుచున్నది.

తెనాలి రామలింగము శిల్పవేత్త యగుటచే నొకప్పుడు ఈశ్వరుని పేరిట నొకసుందరమైన ప్రభను నిర్మించెననియు అందుచే రామలింగమునకు ఈశ్వరప్రభ యనునది బిరుదు వాచకముగ నేర్పడి కొందరాతనిని ఈశ్వరప్రభ రామలింగమని పిలుచుచుండిరనియు దానిని గమనింపనేరని కొందఱు ఈశ్వర ప్రభనుకూడ మార్చి ఈశ్వరప్రగడగ నొనర్చి యది రామలింగని యింటిపేరుగ వ్రాసియుండవచ్చుననియు ప్రస్తుతము కృష్ణా డిస్ట్రిక్టు గుడివాడ నివాసులైనట్టియు తెనాలి రామలింగని వంశసంభూతులయినట్టియు వైశ్వకర్మణులైన తెనాలి అంజనే

యులుగారు కీర్తిశేషులుగాక పూర్వమెుకప్పుడు చెప్పియున్నారు. కాన కృత్రిమ ప్రచురణముగనైన యీ "ఈశ్వరప్రగడ"యను నది రామలింగని యింటిపేరుగాదని యిందుమూలమునఁ గూడ ఖండింపఁ బడుచున్నది.

## ధీ ర జ న మ నో వి రా జి త ము
### (రాయలనాఁటి రామలింగకవిది కాదు)

రామలింగని పేరిట కృత్రిమ ప్రచురిణంబన దగిన "ధీరజన మనోవిరాజితము" అను నొక కబ్బము నేఁడు కాన వచ్చుచున్నది. రామలింగకవి శ. విజయమున "ధీరజనమ నోరంజనము" జేసితినని చెప్పికొనెను గాని "ధీరజనమనో విరాజిత"మని కాదు. ధీరజనమనోవిరాజితమే ధీరజనమనోరం జనమగు నని భ్రమించినచో శ. విజయాది గ్రంథరచనా కాల మగు రాయలకాలము (1509) నకును ధీరజనమనోవిరాజితము నందు సూచింపంబడిన అక్కన మాదనల (1678) కాలమునకు మధ్య 169 సంవత్సరముల వ్యవధి కనంబడుచున్నది. కావున శ. విజయ రచనమునకు పూర్వమే రచియింపబడినట్లు గల ధీరజనమనోరంజనము నీ ధీరజనమనోవిరాజితము నొకటేయనుట కవకాశము లేదు. చరిత్రపరిశోధనమున నీ "ధీరజనమనో విరాజిత" మనునది కృత్రిమ ప్రచురణమని తెలియుం గలదు. మల్లిఖార్జున తనూభవుఁడైన రామలింగని పేరిట కృత్రిమ ప్రచు రణముగ వెలువడిన "ధీరజనమనోవిరాజితము" వలెనే రామా నుజయ్యతనూభవుఁడైన రామకృష్ణుని పేరిటనొక "ఉద్భటారాధ్య చరిత్ర" మను కబ్బ మిటీవల ప్రచురింపఁబడినది. విషయ పరిశో ధనమున నదియు కృత్రిమ ప్రచురణమని ఋజువు చేయుంబడు

చున్నది. గాన నిట్టి కృత్రిమ ప్రచురణము లెప్పుడు వెలువడినను వాని యాథార్థ్యము గమనార్హమగుట సహేతుకముగ ఖండింపఁబడు చుండును.

### ఉద్భటారాధ్య చరిత్రము
(క్రొత్తగా దొరకుట)

క్రీ. శ. 1925 వ. సం॥ ఉద్భటారాధ్య చరిత్రమను పొత్తము మాహిష్మతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది. ఇందు రామానుజయ్య పుత్రుఁడైన రామకృష్ణునకె రామలింగమను పేరు గలిగియునట్లు వ్రాయఁబడియున్నది. లుప్తభాగములు కొన్ని మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రిగారు పూరించినట్లు ఆపూరణాదికములను సమర్థించి వేటూరిప్రభాకరశాస్త్రిగారు పీఠిక వ్రాసినట్లును తద్గ్రంథ సంపాదకుఁడైన మునిగొండ బసవయ్యగారి విజ్ఞప్తివలనం దెలిసెడిని. చూడుఁడు పీఠిక:—

"రామకృష్ణుని కృతులు రెండు ఇదివరకు ప్రకటితములయి యున్నవి. (1) పాండురంగ మహాత్మ్యము, (2) ఘటికాచల మహాత్మ్యము, రామలింగ కృతిగా నిప్పుడు క్రొత్తగా దొరికి ప్రకటితమయినది యుద్భటారాధ్య చరిత్రము. తొల్త నాతఁడు శైవుఁడుగనుండి తర్వాత వైష్ణవుఁడుగ మారెననియె నిందు నిరూపింప నున్నాఁడనుగాన నుద్భటారాధ్య చరిత్రము మునుపటిదిగాను, తక్కిన రెంటిని తర్వాతి వానినిగాను దెలుపు చున్నాఁడను. (ఉ॥ చ॥ వేటూరి ప్రభాకరశాస్త్రి పీఠిక)

రామకృష్ణుఁడు శైవుఁడైనట్లును, అపుడాతనికి రామలింగమను పేరున్నట్లును ఆతఁడే మొందటికిగ నీ'ఉద్భటారాధ్య చరిత్రము'ను రచించినట్లుగను బ్ర॥ ప్రభాకరశాస్త్రిగారు సమ

ర్థింప సాహసించెను. ఉద్భటారాధ్య చరిత్రము మునుపటిదగుచో తరువాతి దనంబడిన పాండురంగ మాహాత్మ్య, ఘటికాచల మాహాత్మ్యములం దెటనైనం దానొకప్పు డుద్భటారాధ్య చరిత్రమును పొత్తము రచియించియున్నట్టులా రామకృష్ణకవి యెందుకు చెప్పికొని యుండఁడు? రామకృష్ణకవి తన వార్ధక దశలో రచియించి యున్నట్లుగల పాండురంగ మహాత్మ్యములో నీ యుద్భటారాధ్య చరిత్రప్రసక్తి లేకపోవుట నిపుడు క్రొత్తగా దొరకినదను నుద్భటారాధ్య చరిత్రము కృత్రిమ ప్రచురణ మనక తప్పినది కాదు. రామకృష్ణునితండ్రి రామానుజయ్య యనియు, నతని తాత తండ్రులకు ముందునుండియు వారు వైష్ణవమత సంప్రదాయకు లనియు వారి పేరులను బట్టి తెలియుచున్నది.

రామకృష్ణుఁడు విద్వాంసుఁడైనది మొదలు పాండురంగ మహాత్మ్యరచనా కాలము వరకును దనకొకపుడు శైవమత సంప్రదాయమునకైన రామలింగమను పేరున్నట్లుగాని తా నొకపుడుద్భటారాధ్య చరిత్రమును పొత్తము రచించినట్లుగాని యెచటను వ్రాసికొనియుండలేదు. రామకృష్ణునకుఁ జిన్నపుడును, బెద్దపుడును లేని శైవమతము, రామలింగనామము "ఉద్భటారాధ్యచరిత్రమునకై యేర్పడుట యాశ్చర్యకరము.

శైవమతస్థు లెవ్వరో శైవమతప్రాబల్యము కొఱకై "రామయ రామకృష్ణుఁడ"నినట్లు "రామయ రామలింగ"మని యాపేరిట నీయుద్భటారాధ్యచరిత్ర రచియించి యుండవచ్చును.

తొలుత నొక కావ్యమున వర్ణించిన తన వర్ణనల నదే సందర్భమున నేమాత్రమును మార్పులేకుండ కొలది పదభేద

ముతో మరియొక కబ్బమున వ్రాసియున్నట్లున్నంత మాత్రమున నదియు పాండురంగమాహాత్మ్యకృతికర్తదే యనుట నెవ్వరును సమ్మతించరు. ఆరెండు కబ్బము (ఘటికాచలమాహాత్మ్యము, ఉద్భటారాధ్యచరిత్రము), లందలి వనవర్ణనములఁ జూడుఁడు.

సీ॥ గీ॥ ఇతరజంతువులును హరి మతిఁదలంచి
కాని యేవర్తనమునకుం బూనవనిన
నా తపోవన మాహాత్మ్య మభినుతింప
నలవియే వేయిమొగముల చిలువకైన (ఘటి. మా.)

సీ. గీ. తరులుఁగల జంతువులు శంభుఁ దలఁచి కాని
యుచితవర్తనములు గోరి యుండవచట
వదనములు వేయు గలుగునట్టి నాగికైన
నాయరణ్యము గొనియాడ నలవి యగునె? (ఉద్భ॥54)

ఈ పద్యముల పోలికనుబట్టియే యీరెండు గ్రంథములు నొకరే వ్రాసిరనుట యసమంజసము. సమర్థుఁడగు కవి రెండు గ్రంథములు వ్రాయునెడ తాను రచించిన యొక గ్రంథములోని పద్యములు మఱియొక గ్రంథమునందానం దుపయోగింపఁడు. మఱియొకఁడగుచో నమ్మించుట కట్లనుకరించుట సహజము.

రామకృష్ణుఁ డొకవ్వఁడు శైవుఁడై రామలింగాఖ్యఁగల్గి యుద్భటారాధ్యచరిత్రము రచియించె నన్నంత మాత్రమున నానాఁటికిఁ బూర్వమునుండియు సుప్రసిద్ధిఁ గాంచిన రాయలయాస్థాన కవియగు మల్లికార్జునతనయుఁడైన రామలింగకవియును నొక మహాకవి మాత్రమాతఁడు కానేరఁడు. * రామకృష్ణునకును, ♦రామలింగమునకును గల వ్యత్యాసము నీక్రిందఁ గాంచుఁడు.

| *రామకృష్ణుఁడు. | ♦రామలింగఁడు. |
|---|---|
| రాయలనాఁటికి బాలకవి | రాయలనాఁటికి ప్రౌఢకవి |
| మంత్రి స్వార్థాభిలాషి. | రాజు హితాభిలాషి |
| రామానుజయ్యపుత్రుఁడు | మల్లికార్జున తనూభవుఁడు |
| తెనాల్యగ్రహారనిర్ణేతననుట | శ్రీకృష్ణరాయదత్త తెనాల్యగ్రహారి |
| పాండురంగమాహాత్మ్య, | పాండురంగవిజయ, ధీరజన |
| ఘటికాచలమహాత్మ్యాది, | మనోరంజన శ. విజయాది |
| రచయిత.శు. యజుర్వేది | రచయితః యజుర్వేది |
| నియోగిబ్రాహ్మణుఁడు | విశ్వబ్రాహ్మణుఁడు |

పై భేదములనుబట్టి సుప్రసిద్ధ రామకృష్ణునకు, సుప్రసిద్ధ రామలింగమునకును గల వ్యత్యాసము తెలుంగ వచ్చును. విషయము లిటులుండ నన్నింటికన్నను వింతయైన విశేష మొండు గలదు. అది యెద్దియన పాండురంగమహాత్మ్యమునే విమర్శకుఁ దీసికొని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు అం దెందును లేని రామలింగ ప్రయోగముఁ బట్టుకొని ప్రాఁకులాడుట.

## పాండురంగమాహాత్మ్యము

(వేంకటశాస్త్రి వ్యాఖ్యానము)

రామకృష్ణునిపాండురంగమాహాత్మ్యమునందలి కవిత్వమునుగూర్చి (1944 సం) ఆంధ్ర వారపత్రికల యందు వరుసగ "రామలింగకవికవిత్వము" "రామలింగ"మనిలింగపదమునేప్రతి యంశమునకును వాడుచు శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు మిక్కిలిగ వ్యాఖ్యానించిరి.

పాండురంగ మాహాత్మ్యమునేయాదర్శప్రాయముగ తీసి కొన్నప్పుడు తత్కృతికర్త నిస్సందేహముగ నందు తెలుపుకొనిన పేరునే పేర్కొనవలసి యుండును. (చూడుఁ డందలి గద్య.)

"సరసకవితానాథ రామకృష్ణకవినాథ." (గద్య. పాం. మా.) ఈ పాండురంగ మాహాత్మ్యమునం దాద్యంతముల నెచ్చటను లేని లింగప్రయోగ మెచ్చటయుకాక యతని కులము గూర్చి వేంకటశాస్త్రి గారికిఁదరితి బ్రశ్నించియుండెను.

" రామలింగకవి విశ్వబ్రాహ్మణుఁడా ? లేక కేవల బ్రాహ్మణుఁడా !" (ఆం. ప. 10-9-1944)

రామకృష్ణుని పాండురంగమాహాత్మ్యాన్ని వ్యాఖ్యానించుచు వీరు మరియొక పేరిట నలపిని శంకింపం బని యేమి ? రామకృష్ణుఁడు నియోగిబ్రాహ్మణుఁడై కానచ్చును. అతని కులావశ్యకతను గూర్చి చెప్పవలయు నప్పుడు "నియోగి" యని మాత్రమే చెప్పవచ్చును. నియోగులు బ్రాహ్మణులా? లేక కేవల బ్రాహ్మణులా? యనునది చర్చనీయాంశమయి యుండెను.

రామలింగకవి యన్ననో యతఁడు విశ్వబ్రాహ్మణుఁడు * కేవలబ్రాహ్మణుఁడును; రామలింగకవి చరిత్రమును, రామకృష్ణకవిచరిత్రమును వారివారి కథలమును, కృతులమును పరస్పర భేద

*విశ్వబ్రాహ్మణుల గోత్ర ఋషులు సానగ, సనాతనాదు లగుట జగద్విదితాంశము. వీరింగూర్చి చయనయజ్ఞ సందర్భమునందలి యిష్టకోపధానముల "యజుర్వేద" శ్రుతుల నైదింటినిఁ గాంచుఁడు.

విశ్వకర్మ ఋషిః ప్రాచీదిశానాం. 'వాతః సానగ ఋషిః ॥౧॥ దక్షిణాదిశాం గ్రీష్మఋతూనామ్ ... దక్షిణాద్వాతో వాతః సనాతనఋషిః. ॥౨॥ ప్రతీచీదిశాం వర్షాఋతూనాం విశ్వేదేవా ... పశ్చాద్వాతో వాతోవా భువనఋషిః॥ ౩॥ ఉదీచీదిశాగ్ం శరదృతూనాం... ముత

మెంతేని కలదు. ఈ వేంకటశాస్త్రివంటి మహాశయులిందు గూర్చి గమనించెదరుగాక.

## ఘటికాచల మాహాత్మ్యము

(వేంకటగిరీంద్రుని పీఠిక)

రామకృష్ణకవి "ఘటికాచలమాహాత్మ్యము" అను కావ్యమును రచించెను, కాని, యాగ్రంథమునకుఁ బీఠిక, గద్య మున్నగునవి కల్పించక పూర్వమే కవి దివంగతుఁడగుటయు ననంతర మొక కొంతకాలమునకు నతని పౌత్రుఁ డసంపూర్తిగ నున్న యాపొత్తమును ఖండోజీరాయఁడను భూవరునకిచ్చుటయు నతండు వేంకట గిరీంద్రు డను నొకకవికి దానినిచ్చి ఆకవిచేఁ

---

రాద్వ్యాత్తో వాతః ప్రత్నఋషిః ॥౪॥ ఊర్ధ్వాదిశాగ్ం హేమంత శిశిరావృతూణాం... అభిభూరయానాం విష్వగ్వాతో వాతః సుపర్ణ ఋషిః॥౫॥ మఱియు కృష్ణ యజుర్వేద (కాం. ౪.౫.) గాంచవచ్చును. "విశ్వరూపో వై త్వాష్ట్రః పురోహితో దేవానా మాసీత్॥ (శ్రుతి ౧) మఱియు ఋగ్వేదము నందలి యీ క్రింది సూక్తములంగూడ దిలకింప వచ్చును.

"అభియజ్ఞం గృణీహినో గ్నావో నేష్టః పిబ ఋతునా। త్వంహి రత్నధా అసి॥" ౧౮౯. (ఋ. సూ. ౧౫)

దం॥ భార్యతోఁగూడిన ఓత్వష్టా! మాయజ్ఞమును స్తుతింపుము. ఏమంటే నీవు రత్నముల నిచ్చువాఁడవయి యున్నావు. (ఆంధ్రి వేదములు పుట ౩౦)

"ఉతత్యం చమసం నవం త్వష్టుర్దేవస్య నిష్కృతమ్।
అకర్త చతురః పునః॥ ౨౦౦ (ఋ. సూ. ౨౦)

దం॥ మఱియు త్వష్ట తనకొఱకు గాఁ జేసికొన్న చెమసను (ఒక సోమ పాత్రను) ఋభవులు (శిష్యులు) నాలుగుపాత్రలుగాఁ జేసిరి. (ఆం. వే. పుట. ౧.)

"అధారయంత వహ్నయో ఽభజంత సుకృత్యయా।
భాగం దేవేషు యజ్ఞియమ్" ॥౨౦౫ (ఋ. సూ. ౨౦)

దం॥ ఋభవులు (మర్త్యులయ్యు) చమసాదిపాత్రలు చేయుటవల్ల దేవతలయి యజ్ఞభాగమును గూడఁ బొందిరి. (ఆం. వే. పుట. 41)

తన వంశాభివర్ణన మందుఁ గావించఁజేసి కృతినందినట్లు తెలియు చున్నది. గిరీంద్రకవి ఖండోజీ తన్నర్థించు సందర్భమున చెప్పిన యీ క్రింది పద్యములవలనను గద్యవలనను నామహాత్మ్యము రామకృష్ణకవి రచియించినట్లు తెల్లంబు.

తే॥ ధరణి తొమ్మిది లిబ్బులు ♦ దాఁచుకొన్న
వానికైనను ధనకాంక్ష ♦ పోనియట్లు
కృతులు పదివేలు గైకొన్నఁ ♦ గీర్తికాముఁ
డైనవానికిఁ జనదు కా ♦ వ్యాభిలాష. (ఘు॥ మా॥ పీ॥ ౩)

ఉ॥ కావున రామకృష్ణకవి ♦ కల్పిత కావ్య మొకండు తెచ్చి స
ద్భావముతోడ నాకతని ♦ పాత్రుఁ డొసంగె ముఖాంకితంబుగా
నీవిఁక పాతశాయకమ ♦ ణి ప్రతిమానముగా మదీయ వం
శావళి చెప్పి తీర్పుమ య ♦ శంబు భృశంబుగ సంఘటిల్లఁగన్

"ఇది శ్రీమత్పరమపదనాథ నిరవధిక పరిచిత సరసకవితా సనాథ తెనాలి రామకృష్ణకవి నాథ" (గిరీంద్రుని గద్య.)

గార్లపాటి రామకృష్ణకవి తెనాలిలో నొకకొంతకాల ముండి యచటనే కాలధర్మము నొందుటచేత గిరీంద్రునివంటి వారాతనిఁ దెనాలిరామకృష్ణకవియని నిర్వచించియుండవచ్చును.

## రామకృష్ణుఁడు రామకృష్ణుఁడే

[అగ్రహారీకుఁడు కాఁడు]

గ్రంథములందలి కృతికర్తల నామములును, లింగ, కృష్ణ నిర్వచనములందలిభేదమును పాటించుటవసరం బగును.

రామకృష్ణకవి యల్లుఁడైన లింగమకుంట రామకవి రామ కృష్ణుని రామకృష్ణకవిగనె యభినందించియుండెను. మఱియు నా

రామకృష్ణుని మనుమఁడగు రామభద్రకవియు రామకృష్ణాఖ్యనె వ్రాసియుంట యీక్రింది చాటువు వలన దెలియఁగలదు.

తే॥ రామకృష్ణాఖ్య జామాతఁ ♦ బ్రకటవిభవు
శుక్లయజు రధ్యయను బేర ♦ సూరిమాచ
యానుజునిఁ దివ్యధీనిధి ♦ కగ్రజాతు
ననఘు లింగమకుంట రా ♦ మార్యునన్ను (చా. ప)

పాండురంగ మాహాత్మ్యగద్యలో రామకృష్ణుఁడు తన తండ్రి పేరు దెలుపలేదు. కాని, తనవంశార్ణవమును దొలిపద్యముల దెలుపుకొనెను. రామకృష్ణునితండ్రి "రామానుజయ్య" యని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. కృతిపతి తన తండ్రియగు రామానుజయ్యను "ప్రభు" వన్నట్లే "తెనాల్యగ్రహార నిర్ణేత" యని తన్నొకపద్యమున వ్రాసికొనినంత మాత్రమున బ్రయోజనమేమి? లేదు. తన కాయగ్రహారమెవ్వరిచేత నీయఁ బడినదియనుప్రశ్నకు సమాధానము లేదు. తెనాలిరామలింగేశ్వరుని యాలయమందలి యొకయుత్సవ(రామలింగస్వామిని)విగ్రహపీఠముపైనుదాహృతంబయిన ఈ క్రింది శ్లోకము వలననైనను రామకృష్ణుఁడు తెనాలి యగ్రహారికుండనిగాని తెనాలివారను నింటిపేరుగలవాఁడనిగాని ఋజువు కాఁబడదు.

శ్లో॥ "శ్రీ తెనాలినగరే వ్యరాజయత్ ద్గ్రాహపాటపుర రామపండితః
శుక్ల మాఘసిత పంచమా గురౌ రామలింగము మయోకృతిం"

తెనాలి రామలింగని కథలు దేశహిత దాయకములును నీతి యుతములును, బ్రజలకును బ్రభుత్వమునకును సహాకారము గల్గించునవియుగను నుండును. అందుచే స్థాలీపులాకన్యాయముగఁ గొన్ని మాత్రమిట సంగృహీతములు.

రామలింగము పాఱులనుండి తాను గ్రహించిన బంగారు ఫలములలో నొకటి రెండు విక్రయించి బీదల కన్నదాన మొనర్చి తక్కినవి ఖజానాయందు జమకట్టించెను.

ఇది యంతయు నెఱిఁగి రాజు రామలింగని యుక్తికిని ప్రజాసేవకును మెచ్చుకొని తనకట్టి సలహానిచ్చిన పండితుల కిది యొక గుణపాఠముగ నుండఁ గలదని సంతసించెను.

## బంగారపు గోదానము కథ

రాయలు విజ్ఞాన సంపన్నుఁడయ్యుఁ దిమ్మరుసుమంత్రి మొదలగు పండితుల సలహాలను దిరస్కరించుటకుఁ గొన్ని యెడల వీలుగాని వారి సలహాచే నొకానొక పితృకర్మమునం దవదఱవలె గోదానమొనర్చు ప్రభువునకు లాంఛనము గాదని బంగారముచే గోవును జేయించి దాన మీనుండెను. దానము గొనుటకు పాఱులును సంసిద్ధమై యుండిరి. వారల శ్రమార్జిత మగు నంత హేమరాశియు నక్రమముగాఁ దమపాలం బెట్టుకొనవలయునని కుతూహల పడుచుండెడి యా పాఱులు తాము దేశసేవకులుగఁ బ్రకటించుకొనుచు నున్మత్తముగఁ బ్రజల మోసగించి ద్రోహముచేయు తలంపుతోఁ దమయూహలు మఱుఁగుపఱచ వలయునని కాంబోలు రాష్ట్రకులపై కల్పితములైన యపరాధములఁ గొరంతలు కొండంతలు చేయుచుఁ బ్రకటించెడి నాయకులట్లు నాబంగారు గోవునందు శిల్పము టంకము జేర్చియుందురని ముచ్చటించుకొను చుండిరి.

ఈ విషయమంతయు రామలింగకవి గ్రహించి అరుంధతి పుట్టినింటివారలను మూఁగవారలఁ బిలిపించి ప్రభువొసంగు దానమున కేర్పడిన బంగారుగోవును దీసికొని పోవలసినవారలు

మీరలని గారికిఁ దెలియఁ జెప్పెను. వారును నిరూపించుకొని సిద్ధవస్తు చలనరహితమగు గోవు తమకె చెందవలయుననియుఁ బాలువాండ్రకుఁ జెందరాదని ప్రభువునొద్ద విన్నవించి న్యాయము యోచనింపఁ దగునని మనవిచేసిరి. రాయలును విషయములు మనస్సునకుం దెచ్చుకొని రామలింగకవినే తగవుఁదీర్చు మని తాటస్థ్యము వహించెను.

రామలింగకవియు నరుంధతీ సంబంధముచేఁ బాలులకును నొక కొంతభాగము లభించుటయె న్యాయమని నిర్వచించి యా గోవు నెడమకాలు తొంటివరకుఁ గలభాగము మాదిగలచేఁ బాలులకిప్పించి తక్కినది మాదిగలు గొనిపో నిర్ణయించెను. హరిజనులు నందులకు సమ్మతించిరి. పాలులును నయ్యది బంగారు గోవగుట నా భాగమైనను దక్కినందులకు గ్రుడ్డికన్ను మెల్ల మేలన్నట్లు లతించుచుఁ బరిగ్రహించిరి.

నాఁటినుండి నేఁటివరకును నా హరిజనులు న్యాయము దప్పక ప్రతి మృతపశువును గొనిపోవునపుడును వాల్గవపాలు వశిష్ఠునిదిగా నొక కాలు వదలి తక్కుంగల మూఁడు కాళుల బంధించి యొందొక కఱ్ఱంజొనిపి మోసికొని పోవు చుందురు.

ఎవరేని యిట్లేల యొకకాలు విడిచితిరని యడుగుచో నాహరిజనులందెవ్వరేనను దెలిసినవా రుండుచో నది బాపన కాలని సిరాఘాటముగఁ జెప్పుచుందురు.

## రామలింగని రాచకీయపు టెత్తులు.

(మరియొక కథ)

క్రీ. శ. 1520 లో రాయచూరు, బిజాపూరు, కలబరగి రాజ్యాలలోని యశ్వపతులను జయించవలయునని కృష్ణదేవ

రాయలు నిర్ణయించుకొనెను, కన్యాకుమారి మొదలు గంజాము వరకుఁగల తన సామ్రాజ్యములోని యున్నాఁడు సామంతులను దగినట్లు సిద్ధముగా నుండ నాజ్ఞాపించెను.

అట్టితఱి బిజాపూరు నవాబు రాయలగుట్టుమట్టు లెఱింగి వచ్చుటకై రాజా శాస్త్రియను నొకనల్లనివానిని పండితప్రకాండునిగ నొనర్చి పంపెను. రాయలు సహజముగ పండితసత్కారి కావున వానిని యథారీతి గౌరవించి తననగరమున నివసింపఁ గోరెను.

రాజా శాస్త్రి రాజమయ్యరను పేర విజయనగరమున నివసించుచుఁ గోటలోని మర్మములను, రాయల నిర్ణయములను గుఱించుచుండెను. రామలింగమీ శ్రోత్రి మానిసి చర్యల సందేహించుచుండెను.

ఒకతూరి రామలింగము రాజసన్నిధిలో రాజమయ్యరును నీకులగోత్రము లెయ్యవి యని ప్రశ్నింపఁగా వెంటనె రాజమయ్యరు తాను కృష్ణయజుశ్శాఖాధ్యాయిని, సంకృతి గోత్రుఁడనని చెప్పి వెడలిపోయెను. అపుడు రాయలు రామలింగనితో నీసందేహము తీఱినదా యని యడుగ ద్విగుణీకృతమైన దని యతఁడు బదులుచెప్పెను. అనుమానము గలుగకుండుట కితఁడు జాగరూకతతో సంచరించుచున్నాఁడు. అయినను నితఁడు నిదురించునపుడేకాంతమున నితని బరీక్షింప వలయునని యుఁజెప్పెను.

ఒక నాఁటిరేయి రాయలును, రామలింగమునుమాఱు వేసములతో బయలుదేరి నిదురించుచుండెడి రాజమయ్యరు గృహము ప్రవేశించిరి. రామలింగము తనయొద్దగల జలకలశ

ములోని చల్లనినీటిని రాజమయ్యారు మొగముపైఁ గ్రుమ్మరింప నతఁడులికిపడిలేచి "అరే! అల్లా! ఎవఁడురా వాఁడు" అనుచు దన మహమ్మదీయ దేశీయ వాక్యముల వెలువఱచుచు పేష్కబ్జీని తీసి పొడువవచ్చుటయు రాయలప్పుడతనిని గూఢచారిగ గుర్తించి సంహరించి "నల్లని వాని నమ్మరాదను" సామ్యము స్మరించుచు రామలింగని యుక్తిసామర్థ్యములకు సంతసించెను.

## కపట జ్యోతిష్కునిఁ దుదముట్టించుట

(ఇంకొక కథ)

రాజా శాస్త్రి యనునొకఁడు రాయలవారునకుం దెలియని జ్యోతిష శాస్త్రవేత్తయగు నొకనిని రప్పించి రాఁబనిచి రాయలు మన్ననాడె దండయాత్రకు సంసిద్ధుఁడగుచో నీ వెటులేని నీ జ్యోతిష సంప్రదాయమునుఁ బ్రకటించి కొంతకాలమాతని నిలువరించఁ గలిగితేని వలసినంత ద్రవ్యమిత్తునని దెలియఁబఱచి విజయనగరమునకుఁ బనిచెను.

జ్యోతిష్కుఁడు విజయనగరమునకు విచ్చేసి తిమ్మరుసు మొదలగు మంత్రులకు భూతభవిష్యద్వర్తమానములం జూచినట్లు చెప్పుచుండ వారును స్వకులాభిమానులగుటఁ దన విద్యాప్రభావము ద్విగుణీకృతమై నాఁగల మెప్పుబొంది వారివలన రాయలచే నాహ్వానమును సైతము పొంది యాస్థానముఁ బ్రవేశించెను.

రాయల జాతకమును బరిశీలించి జరిగిపోయిన యంశములన్నియుఁ బూసగ్రుచ్చినట్లు చెప్పి భవిష్యత్తు నందపజయము గలుగునందును, నొక్క సంవత్సర కాలమైనను యుద్ధయాత్ర మానుట శ్రేయస్కరమనియుఁ జెప్పెను.

జోస్యుఁ డిటుల ఖండితముగఁ జెప్పుట చూచి అనేకులు ప్రజలు, తుదకు రాణులుకూడ నీవత్సరము యుద్ధప్రయత్నముల నింక వహింపుము యనుచు వచ్చి సభలో నుండిరి. కాని, యుద్ధోత్సాహములో నుండిన కృష్ణదేవరాయలును, కొందఱు సేనానులును నీవాక్యములఁ బెడచెవిఁ బెట్టిరి. వారికీవాక్యములు కర్ణకఠోరముగ నుండెను. అయినను సామంతులును, రాణులును నీ జ్యోతిష్కుని వాక్యములు విని యాశాభంగులై యుండుటచే నీతని వాక్యములు కల్లయని నిరూపించిగాని తమవారికి యుద్ధమునెడ సంపూర్ణోత్సాహము కలుగదని తలంచి కృష్ణదేవరాయలు రామలింగని కార్యమంతయు నెఱింగించెను.

రామలింగఁడు జోస్యము నెఱవేరునని చెప్పి, తనకొక యుద్ధవీరుని సహాయము కావలెననుటయు రాయలు వెంటనే యొక యుద్ధవీరుని బిలిచి రామలింగఁడు చెప్పినట్లు నడచుకొనుమని చెప్పుటయు రామలింగఁడా యుద్ధవీరుని వెంటఁబెట్టుకొని జోస్యులవారిని సభాసదనమునకు రావించి "మహాశయా! లోకములోని ప్రజలకు భూతభవిష్యద్వర్తమానముల నెఱింగించుటలోఁ బ్రవీణులని వినియున్నాము. నిక్కమే? యని వచించెను.

జోస్యులందులకు సందేహమా యనుటయు రామలింగఁడు 'అయ్యా! తమ యాయుఃపరిమాణ మెంత యని యడిగెను. అందులకతఁడు డెబ్బదియైదు సంవత్సరములనియు నింతకులోపల జావనుండ లేదనియుఁ జెప్పుచుఁ దన జాతకపత్రముం దీసియిచ్చెను. సరియే! బహుచక్కగ నున్నది. నీకిపుడు 40 సంవత్సరములు వయస్సే కదా! ఈజాతకము పాలు

కాఁగూడదా? యని రామలింగఁడు ప్రశ్నించెను. ఇది పొల్లు యినచో జ్యోతిశ్శాస్త్రమంతయుఁ దగులఁబెట్ట వలసినదియెయని జ్యోతిష్కుఁడు గట్టిగాఁ జెప్పెను. సభ్యులెల్లరును జోస్యులు గట్టిగఁ జెప్పుచుండి రందులకు సంతసించు చుండిరి. రామలింగ డంత యుద్ధవీరుని గనుగొనెను. ఆయుత్తరక్షణముననె జోస్యుని తల యెగిరిపోయినది. జోస్యము కల్లయైనది.

రాయలీ దృశ్యమున కెంతయు సంతసించి యుద్ధమునకు జయభేరిని మ్రోయించి సామంతులకు సహజప్రోత్సాహముల నొసంగి రామలింగనిగూడ నొక యుద్ధవీరునిగ గణుతించెను.

## రామలింగకవి యశస్సు

"ఉ॥ లింగనిషిద్ధుఁ గల్వలచెలింగని మేచకకంధరున్ బ్రశో
లింగని సంశితాళి లవలింగని కర్దమ దూషితమృణా
ళింగని కృష్ణచేలుని హలింగని నీలకచున్ విధాత్రినా
లింగని రామలింగకవి లింగనికీర్తి హసించు దిక్కులన్."*

సోమనాథ విరచితమగు ప్రాచీన విచిత్రరామాయణము నందుఁ గల సుకవిస్తుతి యం దిట్లున్నదఁట.

క. దిగ్గజములలో నొకఁడని
నెగ్గిన ♦భద్రయకు మ్రొక్కి ♦ నృపు సంస్తుతికిం
దగ్గని రుద్రుని దలఁచుచు
నగ్గించెద రామలింగు ♦ నలఘుప్రౌఢిన్ (క. సం. పు. 38)

---

*ఐదుగుల " కవుల సంగ్రహ చరిత్ర"ము బ్రా॥ కొడగాడ గంగయ్యగారిచే వ్రాయంబడి 1929 సం॥ మోసన్ అండు కంపెని ప్రెస్సు (దక్కన్) నందు ముద్రింపం బడినది.

♦రుద్ర భద్ర సోదర కవులు రాయల యాస్థాన కవులు (చూ॥ దే॥ మొ॥ భా॥)

## కథల పరిచ్ఛేదము.

( చరిత్రాంశములు )

రాజహితాభిమానముచే ప్రౌఢకవి (50 సం॥మించిన రామలింగమును మంత్రి (తిమ్మరుసు) అభిమానమున బాలకవి (సుమారు 20 సం॥ మించని ) రామకృష్ణుడును రాయల యాస్థాన కవులం దగ్రగణ్యులై చెలంగిరనుట సత్యేతరముకాదు. అంతమాత్రమున వారివారి కథలందును జరిత్రములందు నిరువుర నొకే వ్యక్తిగ వ్యవహరించు చున్నట్లు దెలిసెడిని. అందుచే చరిత్రాంశముల ననుసరించియే కథలను గూడ విభజించుట యుక్తము. ఉదాహరణమునకు శ్రీ ఏ. ఎస్. పీ. అయ్యర్, ఐ. సీ. ఎస్. గారు త్రిలిఙ్గ''లో వరుసగ (18 వ సారి) వ్రాసియున్న కథలయందలి ముఖ్యాంశముల నిట నుదాహరించి పరిచ్ఛేద మొనరింతుము గాక.

శ్రీకృష్ణదేవరాయలతో రామలింగకవి యిట్లనుచున్నాడు. " నా కేదో దురంతమైన జబ్బు పుట్టిందనీ పదిరోజుల కంటె ఎక్కువ బ్రదుకననీ, మా యింటివైద్యుడు చెప్పాడు. అప్పటినుండి (జీవితమధ్యాహ్నము దాటినవాడ నగుటచే) ఈ కాస్త ప్రాణం గుటుక్కుమంటే నాయాలుబిడ్డలగతి ఏమికావాలి? అనే దిగులు పుట్టింది'' అన్నాడు... ... " భయపడకు " అంటూ రాయలవారు (అతనికి) ధైర్యము చెప్పిరి."

"ఏమో రాజులను నమ్మరాదంటారు" అన్నాడు రామ ...డు 'రాజులందరు అటువంటివాళ్లు కార'న్నాడు రాయలు

"చిత్తం యేలిన వారలా సెలవివ్వడంవల్ల నా దిగులు తీరిం దన్నాడు రామ...డు.

"మరణవార్త రాయలవారు విన్నారు. సభాసదులంతా (మంత్రులు మొదలగువారు) "అయ్యో! పోయినాడా" అంటే "పోయినాడా" అనుకున్నారు.

చల్లగా నౌకరు రామలింగని భాగ్యభోగముల ప్రస్తావం తెచ్చారు. ఏలినవారి సొమ్ము వేలకువేలు ఇంట్లో వేసుకున్నా డన్నారు. ఆడది ఆ సొమ్మంతా ఏమి చేసుకుంటుంది గనుక ? ఏదో తల్లికీ, కొడుకూ యిచ్చి మిగులినది ఖజానాకు చేర్పించడం న్యాయ" మన్నారు. రాయలవారా మాటలు హర్షించి రాజభటులను రామలింగని యింటికి పంపించారు. రామలింగం భార్య భోషాణం చూపించి "అదిగో నాయనలారా! ఉన్న దేమో అందులోనేవుంది; పట్టుకపొండి" అన్నది. రాజభటులు భోషాణం తెచ్చి రాయలవారిముందు దింపారు. దాని తాళపుచెవి రామలింగని భార్య ఒక సంచిలో కట్టి యిచ్చింది. ఆ తాళపుచెవి తీసికొని రాయలవారు స్వయంగా భోషాణం తెరిచిరి. తెరిస్తే అందులోనుంచి "రాజులను నమ్మరా" దంటూ రామలింగం పైకి లేచాడు."

"కళవళపాటును కప్పిపుచ్చే సంతోషంతో రాయలు రామ...నికి భూదానం (అగ్రహారం) యిచ్చి పంపారు."

## రూఢివార్త, రామలింగని మృతి

తరువాత (కొంతకాలమునకు) కృష్ణదేవరాయలు (రామలింగము చనిపోయిన) రూఢివార్త విని చింతాక్రాంతుడై

రామలింగని యింటికివచ్చి, విగతజీవుఁడై పడియున్న యా చిర మిత్రుని గడసారి కన్నులార గాంచి, 'అయ్యో! హాస్యకళా నిధీ! మమ్ము తుదిసారి మోసంచేసి పోయినావా ?" అని చింతించిరి. (చూ. త్రిలిజ్గ. 12-6-1944)

ఈ కథలోఁ గృష్ణపద మటనట ప్రయోగింపఁ బడినంత మాత్రమునఁ బ్రయోజన మేమి? రాయల యనంతర మిరువది సంవత్సరములవఱకు రామకృష్ణకవి జీవించియున్నట్లుగను తుది కాలంలోనే పాండురంగమాహాత్మ్య మతఁడు రచించినట్లుగను దెలిపెడి చరిత్రాంశములు బలవత్తరముగ గన్పట్టుచున్నవి. రామ కృష్ణునకు సంబంధించిన కథ యిది కాదని చెప్పుట కభ్యంతరము లేదు. అట్లని రాయలనాఁట రామకృష్ణుకథలు గలుగ లేదని చెప్పుట కవకాశము లేదు గాని, ఆ కథల తీరు వేరు. ఆ యా చరిత్రాంశములతోఁ గూడిన కథల నొక కొన్నింటి నిట నుదాహరించు చున్నాను. చూడుఁడు.

రామకృష్ణుఁడు కాపుకవిత్వముఁ దెగడిన కథ.

భట్టుమూర్తి కవనము గూర్చి రామకృష్ణుఁ డీ క్రింది పద్యముల రూపంబున ( లోకానుభవము చాలని బాలకవి యగుటఁ ) దెగడినట్లు గలదు.

... కాఁపుఁ గవిత్వపుఁ గూఁతలు
బాపన కవివరుని చెవికిఁ బ్రమదంబిడునే!

శా॥ ఆదిన్సిద్ధగతలంబు బుద్బుదము లు ♦ ద్యద్దారుభూపాలిక
త్పుష్పౌదుంబరపాక పక్వఫలముల్ ♦ శుక్త్యంతరాకాశముల్
రుద్రాక్షాక్షరపం క్తివిభ్రమము లీశరూఢిన్నిరూపింప నీ
శూద్రప్రజ్ఞలు విప్రసత్కవివచ ♦ స్స్ఫూర్తిక్ విడంబించునే (చా. ప. మ)

ఇంత తలబిరుసుగ రాయలయాస్థాన మహాకవియగు భట్టుమూర్తి నాక్షేపించుటఁ జూడ నారామకృష్ణుని దురభిమాన దుర్విదగ్ధహృదయము స్వేచ్ఛగఁ జెప్పనక్కరలేదు. రామకృష్ణుని కీయహంకృతి తిమ్మరుసుమంత్రియొక్క ప్రాపువలనఁ గలిగి యుండవచ్చుననియుఁ దెలియ వచ్చును.

శ్రీ అష్టావధాని పింజలసుబ్రహ్మణ్యకవిగారిందుఁగూర్చి మోమోటములేక 'సమదర్శిని' సంచికలో (1930 సం) భట్టుమూర్తి ప్రశంసగ వ్రాసియుండిన పద్యములందొకండు.

ఉ॥ కాఁపుకవిత్వమంచు నెస ♦ కంబును గూర్పఁగఁ జాలియుండునే
"ఖాళనవారి" కంచుఁబలు ♦ భంగుల దూషణసల్పినట్టి యా
పాపిని, ద్వేషసంకలిత భావుని నెట్టి దురుక్తులాడినన్
గోపమడంగునే సుకవి ♦ కోటకి? మాటకి నెంచనేటికిన్"

## రామకృష్ణుఁడు రాచకవిత్వముం దెగడిన కథ

( ఆ కవిత్వ సామర్థ్యము )

ఒకపుడు వెంకటనాథుఁడను నొకక్షత్రియుకవి "పంచతంత్రము" నునొకగ్రంథమును రచించి రాయలయాస్థానమునకుఁ దెచ్చి "నాయీగ్రంథము సందెవ్వరైనను దప్పుచూపించఁ గలుచో నానాలుకఁ గోసికొందును. తప్పులేనిదే తప్పున్నట్లు వాదించినచో నట్టివాని నాలుకం దెగఁగోయ వలయున"ని శపథముఁ జేసెనఁట. రాయలీ శపథముంగూర్చి యాశ్చర్యముగఁ జూచుచుండెను.

రామకృష్ణుఁడాక్షత్రియునెగాదిగఁ జూచి ఈ "రాచకవిత్వబాధ పడరాదుగదా యెటువంటివారికినిన్" అని పలికి చివాలునలేచి వెడలిపోయెనఁట. అంత నాసభాసదులందఱు

నొకరివెంటనొకరుగ వెడలుటయు రాయలు సభ చాలించుటయు జరిగినది.

వెంకటనాథుఁడు తనకపరాభవముగఁ దలంచి వెంటనె తిరిగిపోయి యీయసంతుష్టిని తనగ్రంథస్థ పీఠికయందుఁబొందు పరచినట్లుగలదు. ఆపద్యము లీక్రిందఁ గాంచవచ్చును.

సీ॥ ఒకఁ డలంకారము । నకు వేడుకవహించు
నొకఁడు వ్యాఖ్యానసమృ । ద్ధికిఁజెలంగు
నొకఁడు శబ్దస్ఫూర్తు । లకు మాయురేయును
నొకఁ డర్థసృష్టికి । నుత్సహించు
నొకఁడు రసాభోగ । తకు మస్తము గదల్చు
నొకఁ డుపమానచ । ర్చికకు నలరు
నొకఁడు రసప్రౌఢి । మకు నిచ్చలో మెచ్చు
నొకఁడు జాతిశ్లాఘ । కుబ్బుచుండుఁ
గామిచందానఁ దలవరి । కరణి బధిరు
వలె దరిద్రునిగతి వాది । పగిదిఁ గనక
కారు చాడ్పునఁ బంగువై । ఖరిఁ గుజాతి
జాడ నిందఱి ముదలింపఁ । జాలు టెట్లు?

ఈపద్యమువలన నాకవియొక్క హృదయమెంత యలమటించినదియు వేద్యము కాకపోదు. ఇంక కృతులంగూర్చిచెప్పిన పద్యములు చూడుఁడు.

కం॥ ఒప్పులుగల కృతిలో నొక
తప్పున్నను గడముకాదు । దానికిఁ గళలం
జొప్పడు శశికిఁ । గళంకము
కప్పేర్పడి యేవిరింద । కావించె నొకో!

ఆ॥ వె॥ అతి కుటుంబభార ♦ నాపేక్షఁ బ్రాల్మాలి
కృతులు మూఢభూమి ♦ పతుల కిచ్చి
చచ్చి నిరయమునకుఁ ♦ జనుకంటె హరి హరా
ర్పణము సేసి సుగతి ♦ వడయరాదె

## రామకృష్ణుని పండ్లు రాలిన కథ

ఒకరోజు ముక్కుతిమ్మనార్యుని గృహమునకు రామకృష్ణుఁ డేగుటయు నతఁ డూయలనూగుచుండఁ "దాతా! యూఁతునా?" యని యడుగుటయు నతఁడు వల్లెయనఁ దుబుక్కున మొగంబుపై నుమియుటయు జరిగినది. అందులకుఁ దిమ్మన కోపోద్దీపితుఁడై దనకాలిపాదుక నారామకృష్ణునిపై విసరుటయు దానిహాటికి రామకృష్ణుపండ్లురాలఁగా రామకృష్ణుం డందులకేమియుఁ జేయనేరక యొకకార్మికుని సాయమున దుప్పికొమ్మును దంతములుగ నమర్చుకొనియెను. ఆ విషయమెల్ల వారికి నపుడె తెలిసినదియైనను సిగ్గుబిడియములులేక యితరులపైఁ జలగాటమాడుచుండెను. అట్టియెడఁ గృష్ణరాయలొకతూరి "రవిగాంచనిచోఁ గవిగాంచునేకదా" యను సమస్యారూపమున నెత్తిపొడిచెనఁట అదియదనుగ భట్టుమూర్తికవి రామకృష్ణునకుఁ దగినరీతి బుద్ధిఁజెప్పవలెనని తలంచి యిట్లా సమస్యను పూర్తిచేసెను.

ఉ॥ "ఆరవి వీరభద్ర చర ♦ ణాహతి డుల్లిన బోసినోటికిన్
నేరఁడు రామకృష్ణకవి ♦ నేరిచెఁ బో మనముక్కుతిమ్మన
క్రూర పదాహతిన్ దెగిన ♦ కొక్కిరి పంటికి దుప్పికొమ్ము ప
ల్గా రచియించె నార! రవి ♦ గాననిచోఁ గవి గాంచునే కదా!

అని రచియించి ముక్కుతిమ్మన చేతఁ దన్నులు తినిన విషయము జ్ఞప్తికిం దెచ్చెనఁట.

## రాయలరాణి లక్షవత్తుల వ్రతకథ

తిమ్మరుసు మొదలగు పండితవర్యులు రామలింగకవి యూరకలేనపుడొక గొప్ప (స్త్రీజాతి) సంతర్పణము గావించవలయునని తలపడిరి. అది రాయలరాణియగు పన్నపూర్ణాదేవి యొనర్చు లక్షవత్తుల వ్రతనిర్వాహణ సమయమగుట నీరి సంకల్పసిద్ధి కవకాశముగూడ నేర్పడినది. రాయలవారితో నిదమిత్థమని నిర్వచించుట కేరికిని వ్యవధి చాలదు. అందుచే రామకృష్ణుఁడు పాఱులకు వస్త్రదానము లిప్పించుటకు నొక యుక్తి బన్నె నట.

వ్రతసమయమునకు భూమి యీనినట్లు పాఱులు పిక్కటిల్లఁ జొచ్చిరి. రామకృష్ణుఁడు వారి మొదుట తన వస్త్రమును జించి యా పేలికలతో త్వరితముగ వత్తులుచేయ మొదలిడెను.

"అది చూచి యా పాఱులందఱును రామకృష్ణుని యొద్దకేతెంచి యిదియేమి? యింత హడావుడిగ ధరించిన వస్త్రము సైతము చించివైచి వత్తులు చేయుచున్నావని యడిగిరి. రామకృష్ణుఁడు వారితో నిట్లు పలికెను. "వ్రతమునకు వత్తులు తక్కువ వచ్చెనట. అందుచే రాయలు వత్తులు చేసి యిచ్చినవారికి వత్తి యొక్కటి కొక్క దీనారముచొప్పున నొసంగెదరు" అని వచించెను.

రామకృష్ణుం డట్లు వచించిన తోడనే పేరాసగల యా పాఱులందఱు తమతమ వసనముల నన్నింటిని జించి కౌపీనధారులై మిగిలిన పేలికలనన్నింటిని వేలకువేలు చిన్నచిన్న వత్తులుగ జేసికొని రాయలవారి సన్నిధికి వానిని గొనిపోయిరి. రాయలవా రా బ్రాహ్మణులం దిలకించి యిదియేమిట్లు కౌపీనధారులై

వచ్చితిరి? యీగుడ్డ పేలిక లెందులకని యడుగుటయు, వారు రామకృష్ణుఁడు తమతోఁ జెప్పిన చొప్పున నెఱిఁగించి యా వత్తుల కన్నింటికి విలువకట్ట దయచేయుండని మనవి చేసిరి. రాయ లవ్వారల పలుకు లాలించి ఇది మీ యవివేకమువలన జరిగినది. రామకృష్ణుని చేష్టలన్నియు నిట్లేయుండునని హెచ్చరించుచు ఆవస్త్రవిహీనులకు నూతనాంబరములుగూడ నొసంగి యనిపె నఁట. ఆ విప్రులందఱును సంతసించుచు రామకృష్ణుని వలననే కదా, మనకీ దానములు దొరికెనని యనుకొనుచుఁబోయిరి.

## రామకృష్ణునివారికి రామలింగము దారిచూపిన కథ

లక్షవత్తులవ్రతము యథావిధముగ సాగిపోయినది. వస్త్రాది దానములం గొని పోయెడి పాఱులొక కొందరొకదిక్కుగ వెడలుచుండిరి. వారట్లు పోవుచు మార్గమందలి యొక చూతవన ప్రాంతంబునందు వంటచేసికొని భుజించి వెడలవలెనను కుతూహలాయత్తచిత్తులై యా మామిడి తోటం బ్రవేశించి యిష్టమృష్టాన్నముల వంటకు మొనర్చి యథేచ్ఛమెయి భుజింప విస్తరాకులకై విచారింపఁ దొడఁగిరి.

ఇంతలో నదేత్రోవను వచ్చుచున్న రామలింగమును గనుంగొని యాబాడబు లతనితో "అయ్యా! రామకృష్ణుని యనుగ్రహమున మాకీ వస్త్రాదిసమస్తము సంప్రాప్తించినది. ఇట వంటచేసికొని భుజించి వెడలవలెనని సర్వపదార్థములును పచనమొనర్చికొనినారము. ఇంక నరటియాకులు కావలసి యున్నది. అవి దొరకు తెర వెద్ది?" యని ప్రశ్నింప రామలింగఁడు వారిం జూచి భూసురులారా! రామకృష్ణునికిఁ బలుకుబడి